# ఏది నిజం?

ఈనాడు సృష్టి గురించి, మానవుడి గురించి, జీవితలక్ష్యాన్ని గురించి, దానిని సాధించే మార్గాలను గురించీ "ఇది నిజం" అంటే, "అది నిజం" అనే విభిన్న దృక్పథాలున్నాయి. వాస్తవానికి మానవుని చరిత్ర అంతా ఈ ప్రశ్నలకు సమాధానం కోసము అన్వేషించడమే. మానవుని నాగరికత వివిధ కళలు, శాస్త్రాలు, సాంఘిక రాజకీయ వ్యవస్థలు, తత్త్వశాస్త్రము...... అన్నీ తిరిగి ఈ సత్యాన్నే అన్వేషిస్తాయి.

ఈనాడు యీ విషయాలను తీసుకొని చర్చించేవారంతా రెండు కోవలకు చెందుతారు : (1) ఎక్కువమంది వారు చదివినవి, విన్నవి అన్నింటినుంచీ వారి దృక్పథాన్ని ఏర్పరచుకొంటారు. వారి చిన్నతనంలో అప్పటికే ఒక దృక్పథానికి చెందిన తల్లితండ్రులు తమ బిడ్డలకు తమ అభిప్రాయాలను అనుసరించి శిక్షణ యిస్తారు. కనుక ముందు ముందు బిడ్డలు ఎదిగే వయస్సులో ఎటువంటి అభిప్రాయాలను ఆమోదించి అంగీకరిస్తారన్నదిగూడ పెంపకము, కుటుంబాలమీద ఆధారపడుతున్నది. (2) స్వతంత్ర యోచనలతో అన్వేషణ కొనసాగించి సత్యాన్ని గురించి ఒక సిద్ధాంతాన్ని రూపొందించుకొనేవారు రెండవ కోవకు చెందుతారు. వీరు చాల కొద్దిమందే వుంటారు.

వీటికితోడు, వారికి ఏర్పడే అభిప్రాయాలు దేశంలోని రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంకేతిక, విద్యావ్యవస్థల పరిస్థితుల మీద మరింత ఆధారపడుతుంటాయి. సినిమా, టి.వి., నవల, పత్రిక, అడ్వర్టైజ్‌మెంట్ మొదలయిన క్రొత్తశక్తులు ఈ ప్రభావాలను ఎంత బలపరచాయంటే, వ్యక్తికి వ్యక్తిగతంగా దృఢమైన విశ్వాసాలు, అభిప్రాయాలూ ఎల్లావున్నా, వాటిని గురించి, తమ గురించీ సంఘం నవ్వుతుందేమోనని, విమర్శిస్తుందేమోననీ భయంతో తమ ఆత్మ విశ్వాసాన్ని కాలదన్నుకొని, నిర్జీవమైన దిష్టిబొమ్మలాగ జీవిస్తారు. పెద్దలలోను, పిల్లలలోను వీటి ప్రభావము పెరిగినకొద్దీ, పెద్దగా ఏ విషయం గురించీ చదవడం 'ఫ్యాషన్' గాదు. ఇప్పుడంతా ఒకే ఆదర్శము; "ఏ సినిమా హీరో, లేక హీరోయిన్ లాగ వున్నామా, వుందామా?" అన్నదే! మానవుడుగా ఉండాలని పశువుగా ఉండకూడదని, దిష్టిబొమ్మగా ఉండకూడదనీ తోచనే తోచదు. అటువంటి ఆలోచనే రాదు. వస్తే దానిని చాదస్తం క్రింద, "బోర్" క్రింద తుడిచి వేయడమే ఫ్యాషన్.

ఉన్నతములు, మానవజాతికి, వ్యక్తి జీవితానికి ముఖ్యములు, అయిన విషయాల గురించి ఆలోచించడమే ఒక పాతకాలపు లక్షణంగా చూడబడుతుంది. అటువంటి ప్రశ్న ఏదైనావేస్తే, "అటువంటి వాటిలో మాకు ఆసక్తిలేదు" అన్నది ఒక్కటే

వారి సమాధానం. "మనిషి" అనడానికి కావలసిన ఒక్క లక్షణమూ వీరిలో తొంగిచూడదు. ఈనాటి సామాన్య యువకుడంటే మనిషి, రక్తము, మాంసము, భావాలు, కోరికలూ, వ్యక్తిత్వము కాదు; వివేచనా, విచక్షణా, బుద్ధి బలము, హృదయము, మనస్సూ కాదు; మగవాడు అంటే 'టైట్‌ప్యాంటు', 'పాయింటెడ్ బూట్', కుచ్చులటోపి, చెవుల క్రిందికి చెంపజుట్టు; ఆడది అంటే వీపు, మెడ, బొడ్డు, ఫోమ్‌రబ్బర్, ప్రేమ అంటే నిరోధ్, అదీ మన పరిస్థితి!

అన్నింటికంటే ఆశ్చర్యమేమంటే, ఆ అనుకరణవల్ల వారికేమీ ఒరిగేది లేదని. నిజంగా వారిలోని బలహీనత – అనర్హతలే ఈ ఆడంబరాలవలన వ్యక్తం అవుతాయని గ్రహించరు. ఈ మానసిక బానిసత్వం ఆత్మగౌరవానికి, మేధాశక్తికీ సిగ్గుచేటని వాళ్ళకేనాడూ తోచదు సరికదా, చెప్పినా, గ్రహించనట్లే నటిస్తారు. తప్పక గ్రహించవలసి వస్తే ఆ మాట చెప్పినవాణ్ని ద్వేషించి, తమ ముఖాన్ని చాటుచేసుకోడానికి, చెప్పేవాడిని అర్థంలేకుండా గేలిచేయ యత్నిస్తారు. ఆనాడు పరస్పరం ప్రేమతో మెదిలి సుఖించమన్న ఏసుక్రీస్తును శిలువ వేసిన మానవజాతికున్న లక్షణాలు ఇవే. సంఘంలోని వ్యక్తులను అలా తయారు చేసే సినిమా వంటి వ్యవస్థలను ఏమాత్రమూ అరికట్టే బదులు, ఆ తారల ప్రాపుమీద, విరాళాలమీద ఎన్నికయ్యే తొత్తులు - శవాన్ని రోడ్డు ప్రక్కన పెట్టి దహనం చేయడానికని కబుర్లు చెప్పి, సంపాదించుకొనే నాయకులు గూడ సినిమా రికార్డులలాగ రాజకీయ నినాదాలు పలుకుతారు. "ఏది నిజం?" అన్న ప్రశ్నకు మరొక అర్థము స్ఫురిస్తుంది. ఇదంతా చూస్తుంటే, 'మనం చూస్తున్నదంతా నిజమా, కలా?' అన్న అనుమానం కలుగుతుంది. అది మనకేగాదు. జన బాహుళ్యానికి గూడ సినిమాకైపు - ఫ్యాషన్‌పిచ్చీ ఎక్కువై, ఏది వాస్తవమో తెలియని స్థితికి వచ్చారు. శరీరానికి ఆచ్ఛాదనకే గుడ్డ అవసరమన్న బుద్ధి (Common Sense) కోల్పోయి. ఫ్యాషన్‌కోసం కుట్టిన దుస్తులలోను, బూట్లల్లోనూ తమ శరీరాన్ని కుక్కి సతమతమౌతారు గాని, సుఖంగా ఉండేలాగ వాటిని తయారు చేసుకుందామన్న బుర్రేలేదు. జీవితాన్ని కళ అనుకరించడం ద్వారా ఉత్తమ కళ అనిపించు కోవలసిందిపోయి, సినిమానూ నవలనూ వాస్తవ జీవితంలో అనుకరించాలన్న బుద్ధిలేని ఆలోచనలతో సతమతమౌతారు.

మనస్సున్న మనిషిగా బ్రతకడం ఫ్యాషన్‌కు వ్యతిరేకం. ఈనాడు ఫ్యాషన్‌లలో మునిగి తేలే యువకుణ్ణి చూస్తే ఒక్కటే గుర్తుకు వస్తుంది. రంగులూపూసి, మీసాలు పెట్టిన అందమైన శవానికి చక్కటి ఫ్యాషన్ దుస్తులువేసి, దాని వెనుక నేపథ్యంలో గ్రామఫోనుచేత కొన్ని మాటలు పలికించి, తోలుబొమ్మకు బదులు ఆ శవాన్ని తాళ్ళతో కదిలిస్తే ఎలా ఉంటుందో అలా ఉంటాడు. ఆ శవానికి తన హీనస్థితి గురించి

ఏమైనా ఆలోచన ఉంటుందా? గర్వంతో దర్జాగా చూస్తున్నట్లు కనుబొమ్మలు, ముఖము దిద్దితే ఆ శవాన్ని ఎంత హీనమైన విధంగా కదిలించినా ఆపని చేయడంలో ఎంతో గర్వాన్ని పొందుతున్నట్లు కన్పించదూ?

మనిషి ఇలా ఎందుకు చేస్తున్నాడు? సుఖం కోసమా? నిశితంగా ఆలోచిస్తే శారీరకంగా టైట్ ఫ్యాంట్లు, ఉలన్ సూట్లు మనదేశంలో ఏమాత్రమూ సుఖాన్ని యివ్వవు. వాటిని ఎందుకు వాడుతున్నట్లు? ఎందుకు ఆరాధిస్తున్నట్లు? అంతేకాదు. పురుషులు సంఘంలోని పరస్త్రీలపట్ల, స్త్రీలు పరపురుషులపట్లా ఎలా వ్యవహరిస్తారో, అలానే ఇతరులు తమవారిపట్ల ప్రవర్తిస్తే సహించలేరు. అయినా బుద్ధిరాదు. ఇటువంటి విచక్షణ లేనివారు గూడ హేతువాదాన్ని నమ్ముతామనడమంత హాస్యాస్పదంగా మరేదీ వుండదు. వారి ఆచరణ అందుకు విరుద్ధం. అలాంటివారు - "నా అభిప్రాయం యిది", "నా నమ్మకం యిది" అంటుంటే, అవి ఒక మనిషి మాట్లాడే మాటలా, లేక గ్రామఫోను రికార్డు పలుకుతున్నదా అన్న సందేహం కలుగుతుంది - ఏది నిజం?

## నా విషయం

భగవద్గీత ఎందుకు చదువుకోవాలి? ఉపనయనం ఎందుకు చేసుకోవాలి?" అన్న ప్రశ్నలతో నా మానసిక జీవితం ప్రారంభమైంది. ఒక వయస్సు వచ్చే వరకూ అందరి పిల్లలలాగా, చెప్పింది చదువుకున్నాను. నా 15వ యేట మా నాన్నగారు నేను భగవద్గీత చదువుకోవడం గురించి, నా ఉపనయనం గురించి ప్రస్తావించినపుడు నేను వేసిన ప్రశ్నలు అవి. అంతటితో ఆయన తాత్కాలికంగా ఆ ప్రయత్నం విరమించుకొన్నారు. తరువాత నాకై నేనే అందులో ఏముంటుందోనని, అందరూ ఆయనచేత భగవద్గీత చెప్పించుకుంటుంటే వినేవాడిని. అలానే ఒకప్పుడు ఉపనయనంగూడ చెయ్యమని అడిగాను. కారణం అందులో ఏముందో ఇంకొకరిని అడిగేకంటే, నాకై నేనే తెల్సుకోవడం మంచిదనిపించింది.

నా 17వ ఏట ఎంతో గాఢంగా నా మమతను చూరగొన్న మా అన్నగారి రెండవ అబ్బాయి తన మూడవయేట నా ఉపనయన సమయంలో శరీరం చాలించాడు. తిరిగి ఆలోచిస్తే అదే నాకు దైవం చేసిన ఉపదేశమా అనిపిస్తుంది. అపుడు నా హృదయం పొందిన దుఃఖము ఒక స్థాయిలో "ఎందుకు దుఃఖపడుతున్నాను? దుఃఖం అంటే ఏమిటి? మృత్యువు అంటే ఏమిటి. అసలు మానవునితత్త్వం ఏమిటి?" అన్న

అన్వేషణగా రూపొందింది. ఈ అన్వేషణలో సుమారు నాలుగైదు సంవత్సరాల వరకూ నేను ఏ పుస్తకాలూ చదవలేదు. ఎవరినీ ఏమీ అడగలేదు. కేవలం నాకప్పటికున్న పరిజ్ఞానాన్ని, తార్కికశక్తినీ వినియోగించి అహర్నిశలూ యోచించడమే నాపని. అలా చేయడంలో నా ఉద్దేశ్యము చెబుతాను- పుస్తకాలలో చెప్పబడ్డ వాదాలచేత ప్రభావితంగాకుండా స్వయంగా సత్యాన్ని తరచడం ఒకటి. ఇంకొక కారణం ఎంతగొప్ప మేధావంతుని మేధస్సుకు తట్టిన ఆలోచనైనా అంత తీవ్రంగా మనమూ కృషిచేసి మన మనస్సును ఆ స్థాయికి తీసుకొనివస్తే మనకు దానంతటదే తెలుస్తుంది కదా? కొన్ని సంవత్సరాలపాటు జరిపిన నా అన్వేషణతో నాకు సందేహములేని సమాధానాలను ఏర్పరచుకొన్నాక, అప్పుడు నా యోచనా విధానంలో గాని, సాధించిన అభిప్రాయాలలోగాని ఏ లోపముందో చూచుకోడానికి పుస్తకాలు చదవడం ప్రారంభించాను. ఎక్కడా ఒక్క విషయంలోనూ నా అభిప్రాయం మార్చుకోవలసిన అవసరము రాలేదు. ఆయా పుస్తకాలలో నాకొచ్చిన భావాలే ధృవపరచబడి వుండడం నాకు సంతోషాన్ని, ఆత్మవిశ్వాసాన్నీ యిచ్చింది. ఆ తర్వాత నేనవలంభించిన ఒక పద్ధతిని చెప్పి, ఆ తరువాత నా అనుభవానికి రెండు ఉదాహరణలు యిస్తాను.

తత్త్వము, ఆధ్యాత్మికతల గురించి చదివినపుడు ఆయా విషయాలను స్వయంగా అనుభవించి చూచినవాళ్ళున్నారా? అని అన్వేషించాను. కాలాంతరంలో వాళ్ళను కలవడం జరిగింది. ఒకర్నికాదు, చాలామందిని. నేను వారిని ప్రత్యక్షంగా చూడడం వలన అద్భుతమైన జీవితమున్నదని నాకు ధృవపడింది. దానిదృష్ట్యా "ఏది నిజం?" అన్న అన్వేషణ తిరిగి సాధించడంలో యిన్ని సంవత్సరాలుగా నా మనస్సుకు తోచినవి, యితరులతో నేను చర్చించినవి, చదివినవీ ఈ పుస్తకంలో కొంతవరకూ పొందుపరుస్తున్నాను.

తీవ్రంగా కృషిచేసి మన మనస్సును తగినస్థాయికి తీసుకొస్తే గొప్ప మేధావంతులకు స్ఫురించిన సత్యాలు సామాన్యమైన మన మనస్సుకు గూడ స్ఫురిస్తాయని నాకు రుజువుచేసిన అనుభవాలలో ఒక దానిని ఇక్కడ పొందుపరుస్తాను.

ఈ వ్యాసావళిలో రెండవ వ్యాసం వ్రాసి సుమారు సంవత్సరం పైగా అవుతుంది. అది కేవలం నా అన్వేషణమీద ఆధారపడి వ్రాసినది. తర్వాత యీ వ్యాసాలను ముద్రణకు పంపే ఉద్దేశ్యంతో మూడవ వ్యాసం వ్రాస్తున్నపుడు "Physics" అను ఆంగ్లవ్యాస సంపుటి నాకు లభించినది. అందులో 229వ పేజీలో ష్రోడింజర్,

"Schrodinger" వ్రాసిన Image of Matter" అను వ్యాసానికి చేర్చబడిన తొలి మాటలోని ఈ క్రింది వాక్యము, నాకు తోచిన భావానికి బలాన్ని చేకూర్చింది.

"The Concept of materiality no longer holds absolutes way. Edward U.Condon, formerly Director of the National Bureau of Standards, points out that the physicist lives in two worlds: He manipulates such tangible objects as coils and vaccum pumps, but his ideas must be appropriate to atomic dimensions. He must enter a world in which mutually contradictory hypotheses much supported by incontravertible evidence must both be accepted...... In fact, this duality is inherent in much of contemporary physics. Werner Heisenberg's uncertainity principle holds that either the position or the speed of a particle may be measured, both can not be accurately determined at any given moment. To explain such parodoxical situations, Neihls Bohr suggested the idea of complementarity, that from any given view point, only part of the picture can be grasped, that for complete understanding, the veiw point itself must be changed. The problem is of great moment. It involves the nature not only of matter but also of ultimate reality".

అనువాదము :- "పదార్థత అనేది ఈనాడు నిస్సంశయమైన అంశము గాదు. భౌతిక శాస్త్రజ్ఞుడు రెండురకాల ప్రపంచాలలో నివసిస్తాడని ఇదివరకు 'నేషనల్ బ్యూరో ఆఫ్ స్టాండర్డ్స్'కి డైరెక్టరుగా పనిచేసిన ఎడ్వర్డ్ యు. కాండన్ చెప్పారు: కాయిల్స్, వ్యాక్యూమ్ పంపులు, మొదలయిన స్థూలమయిన వస్తువులతో పనిచేస్తూనే, పరమాణు స్థాయిలోని పరిమాణాల ననుసరించి అతని మనస్సు పనిచేయాలి. అతని ప్రపంచంలో పరస్పర విరుద్ధమైన రెండు సిద్ధాంతాలుండి, ఆ రెండింటిలో దేనినీ త్రోసిపుచ్చడానికి వీలులేని తార్కాణాలనాధారంగా కల్గివుంటాయి. ఆ రెండు సిద్ధాంతాలనూ అంగీకరించవలసిందే. నిజానికి యీ ద్వయీ భావం ఈనాటి

భౌతికశాస్త్రమంతటా ఉన్నది. వెర్నర్ హైజన్‌బర్గ్ ప్రతిపాదించిన 'అనిర్ణీత సూత్రము' (Uncertainity Principle) ఇలా చెబుతుంది. ఒక కదులుతున్న కణముయొక్క స్థానాన్నిగాని, వేగాన్నిగాని నిర్ణయించవచ్చుగాని, ఒకే సమయంలో ఆ రెండింటినీ నిక్కచ్చిగా నిర్ణయించడం అసాధ్యము. అటువంటి విరుద్ధమైన పరిస్థితులలో నీల్స్‌బోర్ సమన్వయతను (Complementarity) ప్రతిపాదించారు. అంటే ఏ దృక్పథంనుండి చూచినా (వాస్తవంయొక్క) ఒక అంశము మాత్రమే అవగతమవుతుంది. పూర్తిగా అవగతం కావాలంటే దృక్పథం మార్చుకోవాలి. ఈ సమస్య చాలా ముఖ్యమైనది. ఇందులో పదార్థంయొక్క తత్త్వమే గాక, "వాస్తవము." ('అసలు లేక నిజము')ను గూర్చిన ప్రశ్నగూడా ఇమిడియున్నది.

మనము, మనచుట్టూ ఉన్న సృష్టీ మనకు స్థూలము గాను, పదార్థంతో చేయబడినవిగానూ అనుభవమవుతాయి. అయినా ఆ రూపంలో నిజంగా ఏ రూపమూ, గుణమూలేని ఒకే శక్తి వీటికి ఆధారమై ఉండడంగురించి నేటి భౌతికశాస్త్రజ్ఞులు కనుగొని, 'నిజము', లేక 'వాస్తవము' అయిన ఈ సృష్టి స్వరూపాన్ని గుర్తిస్తున్నారు. అనుభవం ఒకలాగుంటే, నిజం అందుకు భిన్నంగాను, విరుద్ధంగామూ, దానికి ఆధారంగానూ అందులోనే ఇమిడి, దాగియున్నదన్నమాట! ఈ శాస్త్రజ్ఞుల సిద్ధాంతాల గురించి చదవక మునుపే కృషితో యిటువంటి భావాలను పొందడం సాధ్యమనడానికిది తార్కాణమని నాకు తోచింది.

### ఈ వ్యాసావళి గురించి మరొక్కమాట

నాకు తెలుగు బాగావ్రాయడం రాదు. నేను చదివినది తక్కువ. వ్రాయడంలో అలవాటు యింకా తక్కువ. భాష పొందికగా వ్రాయడం చేతగాదు. మాతృభాషగా మాట్లాడటం చేతనవడంతో ఎలా మాట్లాడతానో అలానే వ్రాశాను. కనుక ఈ వ్యాసాలను నేను మాట్లాడుతున్నట్లుగా భావించమని పాఠకులకు మనవి. కన్నతల్లి గనుక, మన తెలుగుభాష తన యీ బిడ్డడి పొరబాట్లను చిరునవ్వుతో స్వీకరించి క్షమిస్తుందని ఆశ. నాభావాన్ని ప్రధానంగా తీసుకుని, భాషను అంతగా పట్టించుకోదని విశ్వాసం. ఇది వ్రాయడం చేతనై వ్రాయడం కాదనీ, మాట్లాడకుండడం చేతగాదు గనుక మాట్లాడుతున్నాననీ అనుకున్నా కొంతవరకూ వాస్తవమే.

నా అన్వేషణలో, భావాలలో ఎక్కడన్నా తప్పులు కన్పించినా నేను అన్వేషించిన ప్రశ్నలు పూర్తిగా సమాధానపడకపోయినా, యీ వ్యాసాలు చూచిన సోదరులు ఆ అసంపూర్ణతను నాకు తెలిపి, నన్నునేను సవరించుకొనే అవకాశం కల్పించమని ప్రార్థన. ఈ సంపుటిలోని తాత్కాలిక ప్రతిపాదనల ననుసరించి (Tentative Deductions) మరి కొన్నింటిని ముందు ముందు వ్రాయాలని, ఆ వ్రాయడంలో నేను ప్రత్యక్షంగా చూచిన విశేషమైన వ్యక్తులు, వారి మానవాతీతమైన విజ్ఞానాన్నీ తద్వారా అద్భుతమైన సామర్థ్యాన్ని ఎలా అనుభవపూర్వకంగా (Not merely theoretical but practical) గడించారో చెప్పి, తార్కికంగా యీ వ్యాసాలలో ప్రతిపాదించుకున్న సూత్రాలకు అవి యెలా సమన్వయమవుతాయో పరిశీలించదలిచాను.

- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ

# ఏది నిజం? 2

"ఏది నిజం?" అన్న ప్రశ్నకు సమాధానంకోసం అన్వేషించే ముందు, 'నిజం' **అంటే ఏమిటి? నిజాన్ని తూచే తూకం ఏమిటి?** అన్నది కూడా పరిశీలించడం ఎంత అవసరమో ఇప్పుడే తేల్చుకుందాం --

నిశితంగాచూస్తే 'నిజం' అన్న దాంట్లో వివిధ తెగల నిజం వుంటుంది. ఒకేఒక్క వస్తువు లేక విషయం గురించి మామూలుగా స్థూలమైన అనుభవం ఒకటుంటుంది! నిశితంగాచూస్తే ఈ మొదటి దానికాధారమై, సామాన్యంగా దానికి భిన్నంగాను, వ్యతిరేకంగాను మరొక నిజం వుంటుంది!

ఉదాహరణలు :- (a) మన నిత్య జీవితం సూర్యోదయంతో ప్రారంభమై, సూర్యాస్తమయం తర్వాత రాత్రి మనం నిద్రించటంతో ముగుస్తుంది. ప్రకృతిలోని సకల ప్రాణికోటియొక్క నిత్య జీవితమూ యీ అహర్నిశల పునరావృత్తిమీద ఆధారపడుతుంది. (b) సూర్యుడెప్పుడూ తూర్పునే ఉదయిస్తాడు : పడమరనే అస్తమిస్తాడు. (c) సూర్యుడు దిక్చక్రం పైకి రావడమే ఉదయించడం : దాని క్రిందికి సూర్యుడు దిగిపోవడమే అస్తమించడమన్నది మన నిత్యానుభవం (d) ఈ రెండు స్థానాలనూ ఆధారంగా తీసుకొని ఉత్తర - దక్షిణ దిక్కులను మానవుడు గుర్తించి, ఆ

గుర్తులతో సముద్రయానం మొదలైనవన్నీ సాగించాడు. వివిధ దేశాలలోని శీతోష్ణస్థితులు యీ సూర్యుని బాటకు - ఆ దేశాలకూవున్న సామీప్యాన్ని బట్టి ఏర్పడతాయి. వాటిననుసరించి ఆయా దేశాలలోని నాగరికత, వేష భాషలు, దేశ ఆచారాలు, పైరు పంటలు, వారి వర్తకము, చివరకు ఆహార విహారాదుల క్రమము అన్నీ ఏర్పడతాయి. ఇలా ఆలోచిస్తే తూర్పు - పడమర - ఉత్తర - దక్షిణ యిత్యాది దిగ్భేదాలు మానవుడి అనుభవంలో ఎంత వాస్తవాలో! ఇది ఒక స్థాయికి చెందిన నిజం. అందుకని దిక్కుల ఉనికి, సూర్యచంద్రాదుల ఉదయాస్తమయాలు, ఋతువులు, సముద్రం యొక్క ఆటుపోట్లు ఆ నిజంలోని భాగాలు.

ఇదే విషయాన్ని మరో కోణంలోంచి పరిశీలిద్దాం. భూమి గోళమన్న విషయం గుర్తుంచుకుంటే, అసలు తూర్పు - పడమర మొదలైన దిగ్భేదాలన్నీ కేవలం మానవుడి స్వల్ప ప్రమాణంమీద, అతడున్న స్థలంమీద ఆధారపడి గోచరించేవే గాని, అసలు స్వతస్సిద్ధంగా (Absolute) తూర్పు, పడమరలంటూ ఏమీ లేవని తేలుతుంది. ఏది మనమున్న చోటికి తూర్పు అవుతుందో, భూమికి దానికి సరిగ్గా (Diagnal గా) అవతలవైపు వుండే దేశానికదే పశ్చిమమవుతుంది. తూర్పు పడమరలు అసలు యదార్థంగా, స్వతస్సిద్ధంగాలేవు. అవి కేవలం ప్రాణికోటి అనుభవానికి, భూ పరిభ్రమణానికి చెందినవని తేలుతుంది. అయితే ఈ రెండవది సత్యమైనంత మాత్రాన, అంటే ఆ విషయాన్ని మనం మానసికంగా అవగాహన చేసుకున్నంత మాత్రాన, మనజీవితం మొదటి సత్యాన్ని ఉల్లంఘించి నడవజాలదు. అంటే, భూమి గోళం గనుక దిశ్చక్రం నిజంగా వున్నట్లు, ఉదయాస్తమయాలు జరుగుతున్నట్లు, భూమిమీద ఒకచోట నిలచిన మానవుడికి తోస్తాయేగాని, యదార్థంగా దిక్కులనే లేవన్నంత మాత్రాన మన దైనందిన జీవితం వాటిమీద ఆధారపడక మానదు.

**అలానే మరొక ఉదాహరణ** : మనం నుంచున్న బల్ల కదుల్తే మనం తూలుతాం. రైలు పోతుంటేను, బస్సు పోతుంటేను మనకు తెలుస్తుంది. కాని మన భూమి గంటకు కొన్ని వేల మైళ్ళ వేగంతో తనచుట్టూ తాను పరిభ్రమిస్తున్నా, మనకు మాత్రం అది స్థిరంగానే ఉన్నట్లు అనుభవమవుతుంది! ఇంకా ఎన్నోరెట్ల వేగంతో తక్కిన సౌరకుటుంబంతోపాటు భూమి అంతరిక్షంలో ప్రయాణం చేస్తున్నా, మనకు సుస్థిరంగానే కనబడుతుంది. మన అనుభవం ఒకటి, వాస్తవమొకటి. రెండూ పరస్పర

విరుద్ధాలు. రెండవ సత్యాన్ని సమన్వయించుకొని తన మేధాశక్తితో - ఎందుకు మనం నిత్యజీవితంలో భూమి చలనాన్ని గమనించలేమో తర్వాత వివరిస్తాను. అయితే యీ విషయం గురించి ఆసక్తికలిగి తెలుసుకుంటేనే గాని అది తెలియదు. ఎక్కువ మందికి, యింత సాంకేతిక పురోగతికల్గిన యుగంలో గూడ, యీ విషయాలు చదువుతూంటే ఏవో మరో లోకంలోని విషయాలు, ఏ చంద్రమండలంలోనివో, చదువుతున్నంత ఆశ్చర్యకరంగా వుంటుంది.

మరొక్క ఉదాహరణ : సినిమాలో తెరమీద బొమ్మలు కదుల్తూ ,మాట్లాడుతూ వున్నా, యదార్థానికదంతా ఒక భ్రాంతి. నిజానికి ఆ బొమ్మలకు హేతువయిన ఫిలిమ్‌ను చూస్తే, దానిలో విడివిడిగా ఎన్నో వేలకువేలు బొమ్మలుంటాయి. అవన్నీ అతివేగంగా కాంతిముందు తిరిగే సరికి, అవి విడిబొమ్మలన్న వాస్తవం మరుగుపడి, పరిమిత పరిశీలనా శక్తిగల మన నేత్రాలకు అది ఒకే దృశ్యంగా గోచరిస్తుంది. తెరమీద బొమ్మలలో కదలిక కనబడేమాట నిజమే. విడివిడిగా బొమ్మలుండి వాటిల్లో ఏ చలనం లేకపోవడమూ నిజమే. అది ఎవ్వరూ కాదనలేరు. కాని నాటకంలోనూ, జీవితంలోనూ నిజంగా మనుషులెలా కనబడతారో, మాట్లాడ్తారో, కదులుతారో అలానే తెరమీద కదలడం గూడ అంత 'సత్యం' (అనుభవసిద్ధము). అంటే, తెరమీద జరిగే దానివల్ల జనం సంతోషంతో చప్పట్లు, యీలలూ వేయటం, లేక కళ్ళనీళ్ళు కార్చడం కూడా కద్దు. తెరమీద బొమ్మలు చూచి కామోద్రిక్తులై పరవశులై, రక్తం వోడ్చి గడించిన డబ్బులో సగం పాలు మానవునిలోని యీ బలహీనతను బాగా వినియోగించుకోగల వారి జేబుల్లో కుమ్మరించని పేదజనం ఎంతమంది వుంటారు? అదే ఆకలిగొన్న మరో సాటిమానవుణ్ణి, బిచ్చగాణ్ణి హోటల్‌కు తీసుకెళ్ళి అందులో నాల్గోవంతు డబ్బుతో టిఫెను పెట్టించగల వాళ్ళు ఎంత మంది? ప్రత్యక్షమైన ఈ సాటి మానవుని బాధకంటె ఆ తెరమీద బొమ్మలాట వాడి మనస్సుకు ఎక్కువ వాస్తవంగా గోచరిస్తుంది!

ఈ రెండు స్థాయిల నిజాన్ని యీ మూడు ఉదాహరణలతోనూ 'గుర్తిస్తే' గాని, నేను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు! అనడం మాని, మరొకస్థాయికి చెందిన నిజం వున్నదేమోనన్న విశాల దృక్పథంతో సత్యాన్ని అన్వేషించలేం.

**ఇక ఒక్కొక్క ప్రశ్న తీసుకుని చర్చిద్దాం.**

# ఏది నిజం? 3

దైవము, లోకాలూ, ఆత్మ మొదలైనవన్నీ కల్పితాలు, మూఢనమ్మకాలు అని మనందరికీ "తెలుసు". కారణం మనం ప్రాచీన 'మూఢవిశ్వాసా'ల నుండి 'విముక్తి' చెందాము. అందుకు మనకు ఉపకరించినది, ఈ యుగంలో జరిగిన సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలోని విప్లవం. మానవుడు శాస్త్ర పరిజ్ఞానంతో సృష్టి రహస్యాల నెన్నింటినో తెలుసుకున్నాడు గాని, ప్రాచీనుల విశ్వాసాలకు ఆధారం ఎక్కడా కన్పించలేదట యూరి గెగరిన్ వంటి పరిశోధకులు అంతరిక్షంలోకి వెళ్ళివచ్చి, పైన ఆకాశంలో తనకు దైవం కన్పించలేదన్నాడు. చంద్రమండలంలో కాలుపెట్టిన వారంతా, చంద్రుడు అచేతనమైన గోళమని, దేవతకాదని ప్రత్యక్షంగా 'చూచి' చెప్పారు. వీరిద్దరినీ సత్యాన్వేషణలో మన యుగానికి ప్రతినిధులుగా తీసుకొనవచ్చు. తాము కళ్ళతో చూడనివాటినీ, శాస్త్ర పరిశోధనవలన రుజువు గాని ఏ భావాలనూ సత్యాలుగా అంగీకరించరు. మనందరికి వీరు గర్వకారణంగా ఈనాడు నిలబడటంలో ఆశ్చర్యం లేదు. అందుకే మనకెవరైనా దైవము; మొదలైన పారమార్థిక విషయాల గురించి చెప్పినప్పుడు మనకువచ్చే ప్రశ్నలు - "దీనిని శాస్త్రపరిశోధనతో ఋజువుచేయవచ్చా?" అని గాని, లేక "ఈ విషయాన్ని తార్కికంగా హేతువాదంతో నిరూపించవచ్చా?" అనిగాని. ఆ రెండూ సాధ్యపడనపుడు దేనినీ నమ్మలేము. ఇంత నిష్కర్షగా సత్యాన్వేషణ, పరిశోధన చేసిన శాస్త్రవేత్తల మాటలను మనం నమ్మవచ్చును. ఈ సృష్టిని గురించిన **అభిప్రాయాలలో "ఏది నిజం?" అన్నది చూద్దాం.**

భౌతిక శాస్త్రం ప్రకారం పదార్థమంతా మూడు రకాల సూక్ష్మకణాలతో చేయబడినది. అవి ఎలక్ట్రాను, ప్రోటాను, న్యూట్రాను. ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు రెండు రకాలైన విద్యుత్ సంబంధమైన శక్తితో ఉత్తేజపరచబడి (Charged) వుంటాయి. ప్రతి పరమాణువులో గూడ ఈ రెండు రకాల కణాలూ అతి సన్నిహితంగా ఉంటాయి గాని, ఒక దానితో ఒకటి మామూలుగా ఎప్పుడూ కలవవు, ఢీకొనవు. కలిసినట్లయితే ఒకదానిని ఒకటి అంతర్హితం చేస్తాయి. అప్పుడు పదార్థమే లేకుండాపోయి ధార్మిక శక్తిగా మారిపోతాయి.

పదార్థానికి పునాదిరాళ్ళవంటి ఈ ఎలక్ట్రానుల (Electron), ప్రోటాను (Proton) ల తత్త్వం తెలుసుకోవాలంటే మరొక విషయాన్ని కూడా అవగాహన చేసుకోవాలి. కాంతి, వేడి, రేడియో తరంగాలు, ఎక్స్‌రే (XRay) మొదలయిన వాటి తత్త్వాన్ని గమనించాలి. ఇవన్నీ ధార్మిక శక్తి (Radiation) అన్నకోవకు చెందుతాయి. వీటన్నిటికీ కొన్ని ధర్మాలు సమానంగా వున్నాయి.

1) ఇవి వాటికేదైనా అడ్డు రాకపోతే అంతరిక్షంలో ప్రసరిస్తూనే ఉంటాయి.

2) ఎన్నిరకాల శక్తి ప్రసరణలు ఒకే కేంద్రంలో నుంచి పయనిస్తున్నా, ఒకదానివల్ల మరొకటి అంతరాయం చెందవు.

మనచుట్టూ ఉన్న ఖాళీ ప్రదేశంలోని ఒక చదరపు అంగుళం ప్రదేశాన్ని ఉదాహరణగా తీసుకొందాము. అందులోనుండి ఒకే సమయములో వివిధ దిక్కులలోనున్న కాంతి కిరణాలు పయనిస్తుంటాయి. వాటిలో అనేక వస్తువుల నుండి అనేక దిక్కులకు పయనిస్తున్న కిరణాలు వుంటాయి. అలానే మన స్థూలనేత్రానికి కన్పించకపోయినా, అసంఖ్యాకమైన నక్షత్రాలనుంచీ భూమికి చేరే వివిధ కాంతి కిరణాలు వుంటాయి. ఇవి పగటి సమయంలో దూరదర్శనుల వంటి యంత్రాలకు గాని గోచరించవు. ఇవి గాక, 'వైర్లెస్' ప్రసార తరంగాలుకూడ ఆ చదరపు అంగుళం స్థలంలోనుంచి పయనిస్తూ వుంటాయి. అలానే శబ్ద తరంగాలూ పయనిస్తూంటాయి. కాని వీటిలో ఈ తరంగాలూ మరే తరంగాలనూ ప్రతిఘటించి ఆటంకపరచవు.

3) ధార్మిక శక్తికి మరొక ప్రత్యేక లక్షణమున్నది. అది దాని వేగము; క్షణానికి 1,87,000 మైళ్ళు! అయిన్‌స్టీన్ అంచనా ప్రకారం, అంతవేగంతో మరేవీ పయనించజాలవు.

4) అది వాటితో శక్తిని వహిస్తాయి. భూమిమీద మన నిత్యజీవితాలకు వినియోగపడే శక్తినంతటినీ సూర్యునినుంచి మనకు చేరుస్తాయి. మనము ఈనాడు బొగ్గును కాల్చి సంపాదించే శక్తియంతా కోటానుకోట్ల సం॥లపాటు భూమి మీద అడవులు సూర్యునినుంచి పొందిన శక్తే. ఈ శక్తి సూర్యుని నుంచి భూమికి రెండు విధాలుగా చేరి ఉండవచ్చు. (a) అతి స్వల్పమైన కణాలుగా వచ్చి వుండవచ్చు. దీనినే 'అణువాదము' (Corpuscular Theory) అంటారు. (b) తరంగాల రూపంలో

భూమినిచేరి యుండవచ్చు. దీనిని 'తరంగవాదం' (Wave Theory) అంటారు. ఈ శక్తి తరంగాల పరిమాణాలను శాస్త్రజ్ఞులు కొలిచారు. ఎర్ర రంగుగల కాంతి తరంగం అంగుళంలో 3/100000 భాగముంటుందట. నీలి, (Voilet) కాంతి కిరణము అందులో సగం పరిమాణము కల్గివుంటుంది. ఎక్స్‌రే తరంగం కాంతి తరంగంలో వెయ్యవ వంతు వుంటుంది. కాస్మిక్‌శక్తి తరంగాలు కొన్ని కోట్లు కలిసినా అరంగుళం కంటే ఎక్కువ వుండవు. అలాగే వేడియొక్క తరంగం 1/100 అంగుళం వుంటుంది. వైర్లెస్ తరంగాలు ఒక్కొక్కటి మైలుకంటె గూడ ఎక్కువ వుండవచ్చు. అంటే ఒకే ధార్మిక శక్తి (Radiation) తరంగ పరిమాణభేదం వలన వేడిమిగాను, కాంతిగాను, ఎక్స్‌రేగానూ ప్రవర్తిస్తుందన్నమాట, అయిన్‌స్టీన్ వంటి శాస్త్రజ్ఞుల పరిశోధనలు ధార్మికశక్తి 'ఫోటాన్' అను కణాలరూపంలో జరుగుతుందని సూచించాయి. డేవిస్సన్ వంటి శాస్త్రజ్ఞుల పరిశోధనలు ధార్మిక శక్తి తరంగాల రూపంలో జరుగుతుందని సూచించాయి. అంటే శక్తి ప్రసరణ తరంగంగాను, కణంగాను గూడ ప్రవర్తిస్తుందన్నమాట. అలాంటి పరిశోధనలే, పరమాణువు కూడ అణువుగాను, తరంగ విశేషంగానూ కూడ ప్రవర్తిస్తుందని ఋజువు చేసాయి. ఈఅతి సూక్ష్మమైన కణాలకు (పరమాణువులలోని ఎలక్ట్రాన్ మొ॥నవి) వ్యక్తిగతమైన ఉనికి లేదని భౌతిక శాస్త్రజ్ఞులు చెబుతారు. ఉదాహరణకు ష్రోడింజర్ (Schrodinger) ఇలా చెబుతాడు............ "We have spoken of the fact that particle is not individual. The same particles are really never, observed twice, just as Heraclitus said of the river. 'ఈకణం ప్రత్యేకమైన ఉనికి కలదిగాదని చెప్పాము. హిరాక్లిటస్ నదిని గురించి చెప్పినట్లు) ఏ కణాలు గూడ రెండుసార్లు గమనించబడవు".

ప్రఖ్యాత శాస్త్రవేత్త జేమ్సు అర్నాల్డ్ క్రౌథర్ ఇలా వ్రాశారు. "What is matter? We look upon this seeming solid globe of ours, its mountains and vallies, its pleasant fields and busy cities, its cloud–caped towers and gorgeous palaces. What are they; but Radiations. Radiation imprisoned in electrical bonds and so prevented from obeying the urge of radiation to travel on and on through space. What is their mass but an expresion of intense energy locked up in their minutest

particles? Free them from the chains and they become photons, radiation of smallest wavelength and hence of the great intrinsic energy known to science, travelling through space at the greatest speed known in universe".

అనువాదం :- పదార్థమంటే ఏమిటి? ఈ పర్వతాలు, లోయలు, ఇంపైన పొలాలు, సందడైన నగరాలు, మేఘావృతాలైన శిఖిరాలు రమ్యమైన భవనాలు - ఇవన్నీ విద్యుద్బంధనాలలో నిర్బంధించబడి, అంతరిక్షంలో అలా అలా పయనించె స్వభావం అరికట్టబడ్డ ధార్మిక శక్తిగాక మరేమిటి? వాటి ఘనత, వాటిలోని సూక్ష్మమైన కణాలలో బంధించబడ్డ తీవ్రమైన శక్తికి నిదర్శనంగాక మరేమిటి? ఈ బంధనాల నుండి వాటిని విడుదల చేయండి; అని ఫోటానులవుతాయి అంటే శాస్త్రానికి తెలిసినంతలో అత్యంత స్వల్పమైన తరంగ ప్రమాణం గల్గి, అందువల్ల అత్యంత స్వయంసిద్ధమైన శక్తిగల్గి, అంతరిక్షంలోంచి సృష్టిలో మనకు తెలిసినంతలో అసమాన వేగంతో పయనిస్తుంటాయి.

ధార్మికశక్తి అంటే ఏమిటి? అదియే సృష్టికంతటికీ ప్రధానమైన శక్తి. ఆ శుద్ధశక్తి ఎంత తీవ్రంగా పనిచేస్తుందంటే అది కణంగా పరిణమిస్తుంది. కాని తరంగాలుగా గూడ ప్రవర్తిస్తుంది. అదే సృష్టిలోని వైవిధ్యానికంతటికీ ఆధారమైన ఏకత్వము. అది ఎంత ప్రాథమికమో అంత నిగూఢము. అంటే భాషకూడ దానిని వర్ణించలేదు.

అందుకే ఈ పరిశోధనా ఫలితాలను దృష్టిలో ఉంచుకొని సామాన్య దృక్పథము గురించి అయిన్‌స్టీన్ 'మామూలుగా సామాన్య పరిజ్ఞానము (Common Sense) అన్నది ప్రతివ్యక్తీ 18వ సంవత్సరం లోపల నిలువజేసికొన్న దురభిప్రాయల పుట్ట" అని అంటారు (Einstein pointed out that Common Sense is actually nothing more than a deposit of prejudices laid down in the mind prior to the age of eighteen" - Lincoln Barnet.)

అటు ఎలక్ట్రాన్ ప్రోటానులవంటి అతి సూక్ష్మమైన వాటినుంచీ అతి పెద్ద నక్షత్రకోవలదాకా అన్నీ ఒకే పదార్థముతో - అంటే శక్తి తరంగాలైన పరమాణువులతో - చేయబడి ఉన్నాయన్న సంగతి జ్ఞాపకం రాగానే ఎంతో ఆశ్చర్యముగానే వుంటుంది. కాని యిలా తెలుసుకొన్నంతమాత్రాన అన్వేషణ పూర్తికాదు. అలా చర్చించి అవగాహన చేసుకొన్న సత్యాన్ని అనుష్టించి అనుభవగతం చేసుకోవాలి.

వాస్తవం మన ఇంద్రియాలకు గోచరించే అనుభవానికి విరుద్ధంగాను, భిన్నంగానూ వుంటుందన్న విషయం నవీన భౌతిక శాస్త్రజ్ఞులెలా గుర్తించారో చూచాము. అదే సత్యాన్ని ప్రాచీనులు గుర్తించినా, మనకు కూడా ఆ గుర్తింపు కలిగేలోపు వారు చెప్పినది మూఢనమ్మకంగా తోచడం సహజం. కాని మనకు ఆ గుర్తింపు కలిగాకైనా మన ఋషుల పట్ల మనం అశాస్త్రీయంగాను (Unscientific) మూఢంగానూ చూపిన తిరస్కారాన్ని ఉపసంహరించుకోవలసిన బాధ్యతతోపాటు, వారు చెప్పిన యితర విషయాలలో గూడా అలానే మనకు యింతవరకూ అవగాహన గాని సత్యం వుండి వుండవచ్చునన్న విశాల దృక్పథంతో వారు చెప్పిన సాధనా నియమాలను పాటించి, వాచా చెప్పినవన్నీ అనుభవగోచరం అవుతాయో లేదో పరీక్షిస్తేనే, మనం గర్వంగా చాటుకునే మన తార్కిక శక్తి, సత్యాన్వేషణలు సత్యమని, కేవలం ప్రగల్భం గాదనీ తెలుస్తుంది. అలా పరిశీలించక, పారమార్థిక విషయాల నన్నింటినీ మూఢనమ్మకాలుగా తోసెయ్యటం కూడా ఒక నవీన మూఢనమ్మకమవుతుంది. - ఫాషన్లు (Fashions) మూఢనమ్మకం అయినట్లు!!

"పారమార్థికాన్ని గురించి వ్రాసినవారంతా వారు చెప్పిన వాటిని గుడ్డిగా నమ్మమనీ, తిరిగి చర్చించవద్దనీ అంటారు" అన్నది సామాన్యంగా అటువంటి వారిని గురించి అనుకునే మాటలే. కాని పారమార్థికం గురించిన విషయంలో అనేక విభాగాలున్నాయి. కొన్ని విభాగాలు శంకించమని, చర్చించమనీ, ప్రశ్నించమనీ చెబుతాయి; కొన్ని వద్దని, నమ్మమనీ చెబుతాయి. మొదటి పద్ధతిననుసరించి చర్చించి, అన్వేషించి వాస్తవం యొక్క తత్త్వాన్ని అవగతం చేసుకొన్నాక మరి తిరిగి దానిని తిరస్కరించే అవసరం వుండదు. కాని అంతటితోనే (Practical గా) తెలుసు కొన్నట్లవదు. ఒకే శక్తి సకల విశ్వమంతా అయివున్నది అన్నప్పుడు, మనం కేవలం మానసిక భావాన్ని పొందుతున్నాము. దానినే ధ్యానిస్తుంటే చివరికి ఆ సర్వ వ్యాపకతత్త్వాని మనం పొంది చూడవచ్చునని మహాత్ముల చరిత్రలు నిరూపిస్తున్నాయి. ఈ అనుష్ఠించడం ప్రారంభించే స్థాయిలో యింక మరలా చర్చించడం వుండదు, అవసరంలేదు. శాస్త్రజ్ఞులు భౌతికశాస్త్ర ప్రయోగాలలో ప్రవేశించి, అంతకు ముందు తామువేసుకున్న సిద్ధాంతాన్ని క్రియారూపకంగా మాత్రమే ఎలా పరిశోధిస్తారో, అలానే యీ విషయంలో గూడ అలా యీ రెండు మానసిక స్థాయిలవారికీ అనువుగా రెండు మార్గాలున్నాయి. తార్కిక అన్వేషణ చివరిదశలో తాను సాధించి, లేక ప్రతిపాదించుకొన్న

జ్ఞానాన్ని అనుభవంతో పరీక్షిస్తుంది. దేనిని పరీక్షించదలచారో అది అబద్ధమని ఋజువయ్యేదాకా దానిని శాస్త్రజ్ఞులు శంకించరు. ఆధ్యాత్మిక విషయంలో మాత్రం అలాగాదు.

'అయితే ప్రాచీన సంప్రదాయంలో తార్కిక దృక్పథం వున్నదా?' అంటే, "భగవద్గీత"లో 'పరిప్రశ్న' అంటే సంశయం తీరేవరకు తిరిగి తిరిగి గురువును ప్రశ్నించి తెలుసుకోమని చెప్పబడ్డది. అలానే బౌద్ధంలో గూడ వున్న పారమార్థిక దృక్పథాన్ని "The Secret Oral Teachings of Tibetan Buddhist Sect" అన్న గ్రంథంలో అలెగ్జాండ్రా డేవిడ్‌నీల్ (Alexandra David Neel) మరియు లామా యోంగ్డెన్ (Lama Yongden) యిలా వెల్లడించారు. "గురువు యిచ్చిన ప్రథమ ఆదేశం యిదే" అనుమానించు ............ నీవు మామూలుగా వాస్తవాలనుకునే విషయాలు నిజంగా వాస్తవాలవునో కాదో పరిశీలించు! యాంత్రికంగా (ఆలోచించకుండా) నువ్వు యింత వరకూ అంగీకరించిన వాటిని ప్రశ్నించు! సరికొత్త వాటికేసి చూచినట్లు చూడు!!...... స్థూలమైన యీ సృష్టి కదిలే వస్తువుల సముదాయం కాదు, కదలికే. మనకవుపించే వస్తువులు కదలిక చేతనే చేయబడివున్నాయి. వస్తువులనబడేవి, సంఘటనలు, అన్నీ గూడ అసంఖ్యాకమైన కారణాలనుండీ, పరిస్థితుల నుండి ఉద్భవించిన "సంఘటన"లే, ఈ పరిస్థితులు కూడా కదలికే; చూడబడే వస్తువు, చూచే యింద్రియము, చూచేవాడు అన్నీ కదలికే; అతివేగంగా ఒకదాన్నొకటి అనుసరించడం ద్వారా ఒకే అనుభవంగాతోచే సంఘటనా పరంపరలు. అందువలన మనకు అవగతమయ్యేదంతా ఒక్క తృటిక్రింద ఏది ఎలా వున్నదోనన్న స్మృతే! 'తృటి', 'స్మృతి' అనబడేవి గూడ కదలికచేత ఏర్పడ్డ భ్రమలో భాగాలే!".

"నిజానికి వస్తువుల మధ్య, ఇంద్రియాలకు - వస్తువులకూ మధ్య, ప్రాణులమధ్య, భావాలమధ్య, ఊహలమధ్య సంఘటనే (లేక 'కలయిక') లేదు- విశ్వము కదలిక; ఈ కదలికల కూడికచేత (Contacts) చేయబడినది. ఈ సంఘటనలు, వాటి ఫలితాలే ఈ విశ్వం. అదే పరిమితమైన మన వ్యక్తిత్వం అనబడుతుంది".

"జ్ఞానమంటే కన్పించేదాని చాటున దాగివున్న వాస్తవాన్ని గుర్తించటం...... జ్ఞాని ఎండమావిని చూచి మోసపోడు".

అట్లనే "మహాభారతము"లో వ్యాసుడు వ్రాస్తాడు.

"యత్తద్వ్యక్తస్థ మవ్యక్తం విచిన్వంతి మహర్షయః- "మహర్షులు వ్యక్తమయ్యే దానిలో దాగివున్న అవ్యక్తమును గూర్చి చింతన చేస్తారు" అని.

# ఏది నిజం? 4

ముందు వ్యాసాలలోని హేతువాదంతో మన భౌతిక దేహానికీ, లౌకిక ప్రజ్ఞకూ అనుభవగోచరమయ్యే వాస్తవాలకతీతంగాను, విరుద్ధంగాను ఉన్న సత్యాన్ని తరచి, దాని వలన తెలిసే సత్యాన్ని ప్రఖ్యాత ఆధునిక శాస్త్రవేత్తల సిద్ధాంతాలదృష్ట్యా చూచాము. ఈ వ్యాసంలో సమగ్రంగా సత్యానికి ఆధ్యాత్మిక తత్వం ఏరూపమిస్తుందో చూద్దాము. ఐతే ఆ ప్రయత్నం చేసేముందు ఒక విషయాన్ని స్మరించాలి. ప్రాచీన ఆధ్మాత్మవేత్తలు ఒక దృక్పధంతో, దానికి తగిన క్రమంలో వాస్తవాన్ని గురించి చెప్పారు. మన ఆధునిక దృక్పథం దానికి విపర్యయంగా ఉంటుంది. అందుకని ప్రాచీనులుగూడ అదే విషయాలనుతరచినా, మనకు ఆ క్రమం మాత్రం విపర్యయంగా ఉంటుంది. ఈ వాక్యాలకు అర్థం యీ అధ్యాయం పూర్తిగా చదివితే గాని తెలియదు. అయినా స్థూలంగా అర్థం కావటానికి చిన్న దృష్టాంతము-

ఇంటినించి ఆఫీసుకు బయలుదేరామనుకోండి. ఇంట్లో బయలుదేరిన మనకు దారి ఈ క్రమంలో కనబడుతుంది. ముందు మనింటి తలుపులు, దానిముందు వీధి, మనం గుమ్మంలోకి వచ్చాక మనవీధిలోని పొరుగు గడపలు. మెయిన్‌రోడ్ మీదకు నడుస్తుంటే ముందు మనింటికి సమీపంలో ఉన్న గడపలు, తరువాత దూరంగా వున్నవి తారసిల్లుతాయి. కాని ఆఫీసునుండి బయలుదేరి ఇంటికి వచ్చేటప్పుడు గూడ అవే గడపలూ, వీధులు తారసిల్లుతాయి గాని, క్రమం మాత్రం ముందు దానికి విపర్యయం. ముందు మెయిన్‌రోడ్ను దాటుతాం. తరువాత మనింటికి అన్నిటికంటే దూరంగా ఆ వీధిలో ఉన్న గడప, చివరకు మనగడప తారసిల్లుతాయి. అలాగే సత్యాన్ని అనుభవించి ఆ పరిపూర్ణ జ్ఞానస్థితినే ఎప్పుడూ మనస్సులో ధరించి దానిని సహజం చేసుకున్న తత్త్వవేత్తకు సృష్టిలో మన కన్నింటికంటే దూరంగా వున్న ఆధ్మాత్మిక స్థితులు ప్రధానంగా కనబడతాయి. చివరకు మనం తిరిగి తిరిగి ప్రశ్నిస్తే సమాధానం చెప్పే యత్నంలో మాత్రమే క్రమంగా మన గడపలోని సమస్యలమీద వారి దృష్టి పడుతుంది. అందుకే వారి ఉపదేశాలను ఆచరింపచూస్తే వారి మాటలు పూర్తిగా అర్థంగావు. వారి దృక్పధాన్ని అనుసరించి వారు చెప్పిన శాస్త్ర వాక్యాలను, అనుభవాలను విపర్యయక్రమంలో చూస్తేగాని మనకు వాటిలోని సత్యం సుగోచరంగాదు.

ఉదాహరణకు పతంజలి మహర్షి వ్రాసిన యోగసూత్రాలలో మొదటి సూత్రంలో, 'యోగమంటే చిత్తముయొక్క వృత్తుల నిరోధం' అని చెప్పారు. నిజానికి సాధకుని దృష్ట్యా చూచినట్లైతే అంతకంటె కూడా మనబోటి సామాన్యుల దృష్ట్యా చూచినట్లైతే - సాధన చివరి దశలోగాని ఆ స్థితి అనుభవంలోకి రాదని తేలుతుంది. "ఐతే పతంజలి మహర్షికి యోగ విజ్ఞానం వున్నదిగదా, దానిని చెప్పే క్రమం తెలియదా?' అనవచ్చు - వాస్తవం అదికాదు. ఆచరించటానికి నిజమైన జిజ్ఞాస, పట్టుదల కలిగి గురువుమాట మీద, ఆయన జ్ఞానపదవి మీద సంపూర్ణ విశ్వాసం కలిగి, ఆధ్యాత్మ మార్గాన్వేషణను నిర్విరామంగా అత్యంత ఆకాంక్షతో సలిపే వారికే ఆ శాస్త్రాన్ని వారు బోధించే రోజులవి. ఈ రోజులలోలాగా పుస్తకం అచ్చైంది గదా అని కొనుక్కొని, చదివో చదవకనో, మొదటి రెండు పేజీలు మాత్రమే చదివో, వెంటనే యోగులమవలేదన్న నిరాశా నిస్పృహలు చెందేరోజులు గావవి. ఆ పుస్తకంకోసం డబ్బు దండుగ చేశామని బాధపడి తమ అసమర్థతనంగీకరించటానికి ఆత్మా (దురాశ) భిమానము అడ్డువచ్చి ఆధ్యాత్మికత, దేవుడు, మొ॥నవి మూఢవిశ్వాసాలని కబుర్లు చెప్పి దానినే ఆధునికతలాగ చిత్రించుకొని తృప్తిపడే రోజులుగావవి. అటువంటివారున్నా వారికా విజ్ఞానాన్ని అందనిచ్చేవారుగారు. ఈ కారణంగానే, సామాన్యమైన మానవుడిలో ఈ తత్వాన్ని విమర్శిస్తూ గాబోలు, ఒక అసమాన మానవ తత్త్వవేత్త, కవి వ్రాశారు. "Fools rush where angels fear to tread" ("దేవతలు సహితం అడుగిడను జంకే చోట బుద్ధిహీనులు మాత్రమే దుముకను సాహసిస్తారు") అని.

యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పిన అసమాన తత్త్వోపదేశమైన శ్రీమద్భగవద్గీతను యధాతథంగా వ్రాయక శ్రీ వేదవ్యాసుడు సామాన్యులకు అర్థమయ్యే రీతిన గ్రంథస్థంచేసి, తాను గ్రంధస్థము మాత్రమే చేశానని చెప్పుకొన్నారు. అంటే ధర్మాచరణ జనసామాన్యానికి ఉగ్గుపాలతో పెట్టిన విద్యయైన రోజుల్లోనే ప్రజలకు కూడా నిత్యపారాయణకు, ఆచరణ యెగ్యమైన రీతిలో వ్రాశారు. ధర్మ భ్రష్టత, ధర్మతత్వాన్ని గూర్చి పూర్తి అజ్ఞానము, అంతేగాక స్వాభావికంగానే దాని నాచరించటానికి, అర్థం చేసుకోడానికి అవసరమైన సత్యాన్వేషణ, జిజ్ఞాసలపట్ల గూడ చులకన భావము ఉగ్గుపాలతో నేర్చు మన కాలానికి ఆ గ్రంథమే ఎంతో జటిలమనిపిస్తుంది. అందుకే ప్రాచీన తత్త్వ శాస్త్రజ్ఞులు చెప్పిన సత్యాన్ని పరిశీలించబోయేముందు వారు చెప్పిన క్రమాన్ని మనకర్థమయ్యేలా దిద్దుకొనడానికి ముందు ఒక సత్యాన్ని క్లుప్తంగా జ్ఞాపకం చేసుకోవాలి.

సృష్టి అంతా పరమాణువుల సముదాయం. పరమాణువులన్నీ ఎలక్ట్రాను, ప్రోటాను వంటి మరింత సూక్ష్మమైన కణాలతో చేయబడ్డాయి. అవన్నీ ఒకే శక్తి యొక్క తరంగ విశేషాలు. ఆ తరంగవిశేషాలు కణములు (Particles) గా కూడ ప్రవర్తిస్తాయని నేటి విజ్ఞానశాస్త్రం చెబుతుంది. తరంగాలు కణాలుగా ఎలా ప్రవర్తించగలవో చూడటానికి ఒక తార్కాణము.

సముద్రంలోనుండి ఒక కడవనిండా నీరు తీసుకున్నామనుకోండి. ఆ నీరు అన్ని నీళ్ళలాగానే ఎంతో ద్రవరూపమై, ఏ ఆకారంగల పాత్రలోపోస్తే దాని ఆకారాన్నే పొందుతుంది. అందులో ఎంత చిన్నరాయి వేసినా దానిమేరకు ప్రక్కకు తొలిగి ("Displace" అయి), ఆ రాయి అడుక్కుచేరడానికి అవకాశం యిస్తుంది. అంతేగాదు. ఎంత చిన్నగా దానిమీద గాలివీచినా, ఎంత కొద్దిగా ఆ కుండ కదిలినా ఆ నీరంతటా కదిలి తరంగాలు లేస్తాయి. అంత ద్రవరూపంగల ఆ నీరే, సముద్రంలో పెనుగాలి వీచినపుడు ఆగాలి వేగాన్ని తానుపొంది పెద్దతరంగ రూపంలో ఉవ్వెత్తున లేస్తుంది. ఆ తరంగం పెద్ద నౌకను తాకితే, ఆ నౌకపట్ల ఆనీటి తరంగం కొండరాయికంటే ఘనంగా పరిణమించి, ఆ ఓడను తునాతునకలు చేస్తుంది. అంటే తరంగం కొండ రాయివంటి ఘనపదార్థంగా కూడా ప్రవర్తించగలదన్నమాట. అలాగే పరమాణువులు గూడ, శక్తి తరంగాలైన ఎలక్ట్రానుల సమూహాలే అయినా, మన అనుభవంలో పదార్థ కణాలుగా ప్రవర్తిస్తాయి. ఏ శక్తి చేత అన్ని పదార్థాలు చేయబడ్డాయో, ఆశక్తి మాత్రం ఒక్కటే. అయితే ఒక పదార్థానికీ మరొక పదార్థానికీ (రసాయనిక శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే మూలకము లేక Element కు) తేడాలు ఎందుకుంటాయి? అన్నది ప్రశ్న. ఉదాహరణకు రాగి, బంగారము, ప్రాణవాయువులకు భేదమెందుకున్నది? అన్నది ప్రశ్న. ఒక పదార్థం (మూలకం) యొక్క పరమాణువులో ఉండే శక్తికంటే మరొక పదార్థం (మూలకం) యొక్క పరమాణువులో ఉండే శక్తియొక్క పరిమాణం కొన్నిరెట్లు ఎక్కువగాని, లేక తక్కువగాని అవడం వలన వాటి ధర్మాలలో వైవిధ్యమేర్పడుతుంది. అంటే మూలశక్తియొక్క పరిమాణభేదాన్ని బట్టి పదార్థ బాహుళ్యం ఏర్పడింది. ఘన ద్రవ వాయు రూపాలలో ఉండే యీ మూలకాల కలయిక సృష్టి. **అయితే అంతటా ఒక్కటిగానే ఉన్న శక్తి సృష్టియనే ఈ వైవిధ్యాన్ని ఎప్పుడు ధరించింది? ఎందుకు ధరించింది?**

మొదట ఎప్పుడు ధరించింది? అన్న ప్రశ్నను పరిశీలిద్దాము. 'ఎప్పుడు?' అన్న ప్రశ్న కాలగతిమీద ఆధారపడ్డది. భూత భవిష్యద్వర్తమానాలలో ఉండేకాలం ఏర్పడ్డాకనే 'ఎప్పుడు?' అన్న ప్రశ్నకు అవకాశం కల్గేది - కాలం అన్నది సృష్టితోనే ప్రారంభం కాగలదు. ఆదిశక్తినుంచి అనేక పదార్థాలు ఏర్పడిన పిదప వాటిలో అనుక్షణమూ జరిగే మార్పే కాలగతియొక్క రూపం. ఆ మార్పు వివిధ వస్తువులలో, వివిధవేగాలలో జరుగుతూంటుంది గనుక ఒకదాని పరిణామ వేగానికి మరొకదాని పరిణామ వేగం (rate to change) ఎన్ని రెట్లు హెచ్చు, లేక తక్కువ అన్నదే కాలానికి కొలత. ఉదాహరణకు ఒకడి వయస్సు 15 సంవత్సరాలు అనుకోండి. అంటే భూమి తన చుట్టూ తాను 24 గంటల్లో పరిభ్రమిస్తుంటుంది. అటువంటి 28రోజుల కొకసారి చంద్రుడు భూప్రదక్షిణం చేస్తుంటాడు. రమారమి అటువంటి 12 మాసాల కొకసారి ఋతుచక్రం ఒక ఆవర్తం అవుతుంది. అటువంటి ఆవర్తాలు అతను పుట్టినప్పటినుంచి 15 అయినాయని అర్థం. అంటే ఋతుచక్రం పరిభ్రమణం కంటె దీర్ఘమైన జీవితాన్ని ఋతుచక్ర పరిభ్రమణంతోను, ఆ ఋతుచక్ర పరిభ్రమణాన్ని అంతకంటె తక్కువ పరిమాణంగల చాంద్రాయణంచేత, దానిని అంతకంటె తక్కువదైన దినచక్రం చేత కొలుస్తున్నాం. మనం జీవితంలో ఒక్క రోజులో అసంఖ్యాకమైన పనులు చేస్తాంగనుక వాటి కాలనిర్ణయం కోసం రోజుని సూర్యుని స్థానాన్ని బట్టి పూటల క్రింద, పూటలను గంటలు గాను, గంటలను నిమిషాలుగానూ విభజించాము.

నిజానికి సృష్టి జరిగి ఎన్ని సంవత్సరాలైందని ఏనాటికీ ఎవ్వరూ తేల్చలేరు. దానికి నిదర్శనం? ఈ సృష్టియొక్క వయస్సును గురించి భౌతిక శాస్త్రజ్ఞులు చేస్తున్న అంచనాలు ఎంత తలా తోకాలేకుండా తారతమ్యం కలిగినవిగా వుంటున్నాయో చూడండి. ఏ వ్యక్తినైన చూపి, అతని వయస్సు ఎంతవుండవచ్చు అన్నప్పుడు, ఒకసంవత్సరమో, లేక 75 సంవత్సరాలో అన్నంత అసంబద్ధం గానే ఉంటాయి వారి అంచనాలు.

ఈ సృష్టియొక్క వయస్సు ఏనాటికీ ఎవరూ ఎందుకు నిర్ణయించలేరు అన్నదానికి మరొక కారణం చెబుతాను. సృష్టి అనుక్షణమూ మారుతూ వుంటుంది. కొన్ని అసంఖ్యాకమైన పరిమాణాల వలన ఏర్పడ్డ క్రొత్త పదార్థ సముదాయాలయొక్క

క్రొత్త ప్రభావాలవలన గాని, లేక ఇదివరకున్నవి కొన్ని కాలగతిలో నామరూపాలు లేకుండా పోవడంవలనగాని, తదనంతరం సృష్టిచెందే మార్పు యొక్క తత్త్వం లోను, వేగంలోనూ, అనూహ్యమైన మార్పు జరుగుతుంది. ఆధునిక యుగంలో అణు ప్రయోగాలవల్ల, యుద్ధాలవల్ల, అసంఖ్యాకమైన యంత్రాలు వినియోగించి విసర్జించిన వివిధ రసాయనిక పదార్థాల యొక్క ప్రభావంవల్ల, ఎరువులు, మందులు, క్రిమినాశకాలు, మత్తు పదార్థాలు మొదలైనవాటి ఉత్పత్తి సంమిశ్రాలవల్ల, నేలలోనుండి అపరిమితమైన నీటిని వెలుపలికి తీసి వినియోగించటం వల్ల, రాళ్ళు, బొగ్గు, మరి ఇతరమైనవి గనులలోనుండి వేలకువేలుటన్నులుగా త్రవ్వితీసి ఇతర జాగాలకు తరలించడంవల్ల - వీటివలన భూగర్భంలో మన మూహించలేనంత మార్పు కల్గుతుండాలి. ఈ మార్పులవల్ల దానిమీద నివసించే జీవులలోనూ గూడ ఎంతో పెద్దమార్పులు కలుగుతుండాలి. ఎంతో - నెమ్మదైన క్రమంలో రావటం వల్ల ఆ మార్పు ఎప్పటికప్పుడు తెలియకపోవచ్చు. అందుకని లక్షల సంవత్సరాల క్రిందటి పరిస్థితులు ఎలా వున్నాయో మనకు నిర్దుష్టంగా తెలియదు. కనక వెనక కలిగిన మార్పులను, రాబోయేవాటినీ మనం పూర్తిగా వూహించలేము. అటువంటివి ఈ సృష్టి ఉత్పత్తిలో, కోటానుకోట్ల సంవత్సరాలలో ఎన్ని జరిగాయో అన్నీ నిర్ణయించి అంచనావేస్తే తప్ప ఈ విషయం తేలదు. అది జరిగే పనికాదు.

అంటే సృష్టికి ఆది ఏదో, కాలానికి కూడా ప్రారంభమదే! 'సృష్టి ప్రారంభమై ఎంతకాలం అయింది?' అని అడగటం కాలం ఆరంభమై ఎంతకాలమైంది? అని అడిగినట్లే అవుతుంది. లేక ఆదికి, ఆది యేది? అని అడినట్లన్న మాట. బావిలో సూది పడిందని కథ చెప్పి, 'ఆ' 'ఊ' అన్న శ్రోతతో 'ఆ' అంటే వస్తుందా? 'ఊ' అంటే వస్తుందా? అన్నట్లు వుంటుంది.

ఇంక ఒకే శక్తి ఈ సృష్టిగా ఎందుకు రూపొందింది? అన్న ప్రశ్న కొద్దాము. మామూలుగా "ఎందుకు?" అన్న ప్రశ్న అడగాలంటే అనేక వస్తువులుండాలి "మీరెందుకు వచ్చారు?" అని అడగాలంటే వచ్చినవాడు, వచ్చినచోటు, రావటానికి కారణం - (ఉదాహరణకు) ఆఫీసు, ఉద్యోగం, ఉద్యోగం ఇచ్చేవాడు, అక్కడకు చేరడానికి అధారమైన సాధనాలు (కారు, బస్సు, రిక్షా, రోడ్డు, తనకాళ్ళు, కాళ్ళలో నరాలు, వాటిలో నడిచే శక్తి) అటునడిస్తే ఆఫీసు వస్తుందనే ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞను సక్రమంగా

పనిచేయించే సాధనమైన మెదడు, ఇవన్నీ కలిగిన అతడు జన్మించడానికి కారణమైన తల్లిదండ్రులు, మళ్ళీ వారిని గూర్చి వచ్చిన ఇన్ని ప్రశ్నలూ-ఇన్నిఉండాలి. అలా అలా పోయి అన్ని ప్రశ్నలకూ కలిసి ఒకే సమాధానం ఎదురవుతుంది. ఒకే శక్తి ఇన్ని అవటమే కారణమని. ఇన్ని వస్తువులూ ఆ శక్తి, సృష్టి రూపం ధరించకముందు ఎక్కడివి? అప్పుడు ఆ శక్తి తప్ప మరేమీ లేదు. అయితే ఆ శక్తి యీ అనంతమైన వస్తుజాలంగా ఎందుకు రూపొందింది? అన్నదే మన ప్రశ్న కనుక దానిలో ఏమార్పు రావడానికి కారణం మరోవస్తువుగాజాలదు. ఆ మరొక వస్తువు వుంటే గదా! అంటే ఆ శక్తిలో వచ్చిన మార్పుకు అదే కారణం అయివుండాలి.

ఈ విధంగా దానిలోని మార్పుకు అదే కారణంగావాలంటే ఆ మూలశక్తికి చైతన్యం స్వాభావికము, లేక సహజమూ అయివుండాలి ఉదాహరణకు సృష్టిలో జడ జీవపదార్థాలకు గల భేదమదే. జడ పదార్థంతో చేయబడ్డ ఏ వస్తువూ బాహ్య కారణంలేక, తనకై తానే తనలో ఏ మార్పూ చేసుకోలేదు. జీవపదార్థానికిది చేతనౌతుంది. నాకు కూచోవాలనిపించి కూచుంటాను; కాళ్ళు లాగడం కారణం కానక్కరలేదు. ఎవరో పిలవడంగాని, పొమ్మనడంగాని, నెట్టడంగాని కారణం కానక్కరలేదు. స్వేచ్ఛ (స్వ అనగా తన యొక్క ఇచ్ఛ = కోరిక) కారణం. దానినే బుద్ధి, మనస్సు అంటారు. అలా నిర్ణయించుకోగలగడానికి చైతన్యం ఆధారం. ఆ గుణం సృష్టికాధారమైన శక్తికి స్వభావసిద్ధమై, సహజధర్మమై ఉంటే తప్ప తనకై తానే వేరు కారణం లేక, ఈ సృష్టిరూపాన్ని పొందలేదు. చిత్రమేమంటే ఈ సృష్టిలో కొంత పదార్థం జడంగాను, కొంత పదార్థం సజీవంగాను ఉండడమే. స్థూలదృష్టికి ఇది ఎంత అసమంజసమంటే చైతన్యంగల తల్లిదండ్రులకు, చైతన్యంగల బిడ్డలతోపాటు ఒక నిర్జీవమైన రాతిబండకూడా జన్మించినట్లు.

ఈ సమస్య తేలాలంటే మరొక దృష్టాంతాన్ని పరిశీలించాలి. తండ్రి శరీరంలోంచి గర్భధారణ కొరకు తల్లిగర్భంలో ప్రవేశించే జీవకణమైన వీర్యకణాన్ని గురించి ఆలోచించండి. ఆ జీవకణానికి కళ్ళూ, ముక్కు, నోరు, చెవులూ, కాళ్ళూ, జీర్ణకోశమూ, మర్మేంద్రియాలు మొదలైనవేవీ ఉండవు. అయినా గర్భధారణానంతరం వాటిని ఉత్పత్తి చేయగల సామర్థ్యం ఒక ప్రకృతిసూత్రము లేక ధర్మము (Principle) రూపంలో మాత్రం ఉంటుంది. అంతేకాదు గర్భధారణానంతరం ఇవన్నీ పొంద

గలగడంతోపాటు తాను శుక్లశోణితాలలో ఒకదానిని ఉత్పత్తి చేయడంద్వారా అలా కొన్నికోట్ల తరాలవరకు పునరుత్పత్తి సూత్రం (బీజంలోని అంకురంలాగ) దాగి వుంటుంది. అలాగే శనగ విత్తనంలోని దళాలలో ఆకుపచ్చదనం లేదు. కాని దానిని నాటిన తరువాత ఆకుపచ్చటి మొక్కను ఉత్పత్తిచేసే సామర్థ్యం సూత్రప్రాయంగా (Principle) మాత్రమే వుంటుంది.

ఈ రెండు ఉదాహరణలతోను "సూత్రప్రాయంగా ఉండటం" అన్న పదాలను ఏ అర్థంతో వాడబోతున్నామో ఎరుకపరచుకొంటున్నాను. అది గుర్తుంచుకొని ముందుకు చదువుకుపొండి.

ఉదజని (Hydrogen) ప్రాణవాయువు (Oxygen) అన్న రెండు వాయువులు ఒక నిష్పత్తిలో కలిసి నీరు అన్న ద్రవపదార్థమౌతుందని రసాయనిక శాస్త్రం చెబుతుంది. ప్రాణవాయువుగాని, ఉదజనిగాని ఏ ఇతర మూలకాలతో ఏ నిష్పత్తిలో కలిసినా నీరు మాత్రం ఏర్పడదు. అంటే నీరు రూపాన్ని ధరించవలసిన విధంగా కలిసే శక్తి ఆ రెండు వాయువులకే ఉన్నదన్నమాట. ఆ రెండు వాయువులు కలవకముందు గూడ ఉదజనికి ప్రాణవాయువుతో ఆ నిష్పత్తిలో కలిసే ధర్మం ఉన్నది. అలానే ప్రాణవాయువు కూడా. అంటే సృష్టిలో ఏక్షణాన ఈ రెండు వాయువులు ఏర్పడినవో, ఆ క్షణంలోనే ఆ రెండూ ఆ నిష్పత్తిలో కలిసే అవకాశం సూత్రప్రాయంగా ఏర్పడినదన్నమాట. ఆ రెంటిలోని ఆ ధర్మంరూపంలో నీరు సూత్రప్రాయంగా ఏర్పడ్డది అన్నమాట.

అట్లానే సృష్టిలోని వివిధ మూలకాలయొక్క ధర్మాలన్నీ ఆదిశక్తిలో సూత్రప్రాయంలో ఉండి ఉంటుంది. లేకపోతే అవన్నీ ఏర్పడ్డం ఎలా జరుగుతుంది? అదీ ఆ ధర్మంలో భాగమే. ఏ మూలకాలు మరే మూలకాలతో ఏ నిష్పత్తుల్లో కలసి ఏ పదార్థరూపం ధరిస్తాయోనన్నది ఆ మూలకాల్లోనే సూత్రప్రాయంగా ఉండి ఉండాలి. తేలికైన భాషలో చెప్పాలంటే ఆదిశక్తికి తనలో కొంత భాగం ఉదజనిగాను, కొంత ప్రాణవాయువుగానూ ఏర్పరచుకొనే స్వభావం ఉండి ఉండాలి. లేకుంటే ఆ రెండూ ఏర్పడవు. అలా ఏర్పడే స్వభావంలోనే ఆ రెండు పదార్థాలకు పరస్పరం అలా కలిసి ఉండటం అనే సూత్రం ఉండాలి. లేకుంటే ఆ రెండు వాయువులూ ఏర్పడ్డా ఆ విధంగా కలిసి నీరు కాజాలదు.

ఇలానే సృష్టిలోని వివిధ వస్తు పదార్థములన్నింటికీ ఉన్న ధర్మాలన్నీ ఆశక్తిలో సూత్రప్రాయంగా ఉండాలి. అప్పుడే ఇవన్నీ ఇట్లా ఏర్పడి ఈవిధంగా రూపొందగలవు. వాటిల్లో జీవములేక చైతన్యమన్నది కూడా ఒక లక్షణం అయ్యుండాలి. కాకుంటే ఆ శక్తి పదార్థరూపం ధరించినపుడు ఆ పదార్థమంతా జడమే అయ్యుండాలి. అలా కాదు గనక కొంత పదార్థం సజీవం అయింది.

అంటే ఆశక్తి నుండి ఏర్పడ్డ మూల పదార్థాలలో ఆశక్తి ద్రవ వాయు ఘన రూపాలు మూడూ కల పదార్థాలుగా ఎలా ఏర్పడిందో - అన్నీ ఒకేలాంటివి కాకుండా -- అట్లానే కొన్ని సజీవంగా, కొన్ని నిర్జీవంగా ఏర్పడ్డాయి.

ఐతే ఇక్కడ ఇంకో రహస్యంవుంది. ఆశక్తే జడ పదార్థంగాను, జీవపదార్థంగాను రూపొందినట్లు కనిపించినా జడపదార్థంలోకూడా జీవలక్షణం బీజప్రాయంగా (అంటే సూత్రప్రాయంగా) వుంటుంది. మనం జీవపదార్థంగా గుర్తించే వాటిల్లో ఆ లక్షణం బాగా వ్యక్తమౌతుంది తదితరంలో వ్యక్తంకాదు. కాని వుంటుంది. ఎట్లా? అంటే ఏ రెండు వస్తువులను ఒకదాని కేసి మరొకదానిని రాసినా వేడి పుడుతుంది. కాని ఎండువాటిల్లో త్వరగా వ్యక్తమౌతుంది. పచ్చివాటిలో అంత త్వరగా కాదు అంతేకాక ఎండుపుల్లల్లోకంటె గచ్చకాయ, చింతగింజ, రాయి మొదలైనవాటిల్లో మరింత త్వరగా వేడి వ్యక్తమౌతుంది. నీటినైనా తీవ్రంగా కలయపెడితే వేడివస్తుంది. కాని గమనించతగినంతగా రాదు. అంటే రాపిడి పెట్టినప్పుడు వేడెక్కేగుణం అన్ని పదార్థాలకూ ఉన్నా కొన్నిట్లో బాగా వ్యక్తమౌతుంది, కొన్నిట్లో కాదు..... అట్లానే!

ఈ సమస్యయొక్క మరో అంశాన్ని కూడా చూద్దాము. సృష్టిలో వేడి, వెలుగు, శబ్దం,(X rays) ఎక్స్‌రేస్ మొదలైనవన్నీ శక్తి ప్రసరణకు నిదర్శనాలు, దాని రూపాలు. ఐతే ఆశక్తి తరంగాలుగా ప్రసరించేటప్పుడు ఆ తరంగంయొక్క దైర్ఘ్యాన్ని (Wave length) బట్టి అది కాంతిగాని,వేడిగాని, లేక మరేశక్తి ప్రసరణ రూపాన్నైనా పొందుతుంది. ఆతరంగంయొక్క పరిణామాన్ని మనం ఏవిధంగానైనా హెచ్చించడంగాని, తగ్గించడంగాని చేయగలిగితే కాంతి వేడిగాను. వేడి కాంతిగాను మారగలుగుతాయి. మరోలా చెప్పాలంటే కాంతిలో వెలుగు, వెలుగులో వేడి, ఈ రెంటిల్లో శబ్దం, శబ్దంలో ఈరెండూ ఉన్నాయన్నమాట – సూత్రప్రాయంగా.

అట్లానే మన యోగులు ఇనుమును బంగారంగా మార్చగలిగేవారు. ఆ విషయాన్ని మొదటగావిన్న పాశ్చాత్యులు నవ్వారు. ఒక మూలకం మరొక మూలకంగా

మారడం జరగదన్నారు. కాని పరమాణువుయొక్క తత్వాన్ని బాగా అవగాహన చేసుకొన్న ఆధునిక శాస్త్రవేత్తలు ఆ పని అసంభవం కాదని అంగీకరించారు. తక్కువ శక్తిని కలిగియున్న పరమాణువులలో ఏ విధంగానైనా మరికొంత శక్తిని ప్రతిష్టించగలిగితే, ఆ పదార్థం ఎక్కువ శక్తిని ఇమడ్చుకొన్న మరొక మూలకంగా మారుతుంది. సీసంయొక్క పరమాణువుల్లోకంటే బంగారం యొక్క పరమాణువులలో ఎక్కువశక్తి యిమిడివుంటుంది. శాస్త్ర ప్రయోగంద్వారా సీసంయొక్క పరమాణువుల్లో మరికొంత శక్తిని ప్రవేశపెట్ట గలిగితే అది బంగారంగా మారుతుంది. ఇది ఎటామిక్ రియాక్టర్స్‌లో ప్రత్యక్షంగా చేసిచూచిన సత్యమే. ఐతే ఈవిధంగా బంగారం తయారుచెయ్యడం చాలా ధనవ్యయంతో కూడుకొన్నది. ఈ విధంగా బంగారం చెయ్యడం లాభదాయకం కాదు.

అంటే ప్రతి శక్తి ప్రసరణ రూపాన్ని (Form of radiation) మరొకదానిగాను! ప్రతి మూలకాన్ని మరో మూలకంగాను మార్చవచ్చు. కారణం అవన్నీ ఒకే శక్తియొక్క రూపాంతరాలు గనుక. ఐతే పాఠకులలో విశేషమైన శాస్త్ర పరిజ్ఞానం కలిగివుండి, "ఫలాని మూలకాన్ని ఫలాని మూలకంగా మార్చడం మాత్రం వీల్లేదండీ; ఏ శాస్త్రజ్ఞులూ చేయలేకపోయారు" అని ఏమూలకాల గురించైనా అంటే నా సమాధానం ఇది: "మీ ప్రశ్నకు అర్థం - ఆ మూలకాలను మార్చే విధానాన్ని ఇంతవరకూ మానవుడు కనుక్కోలేదు అని మాత్రమే" ఇకముందు కనుక్కోలేరనికాదు. పరమాణువులు అభేద్యములని శతాబ్దాలపాటు అన్నారు పాశ్చాత్యులు. భేదించడం సాధ్యమని తేల్చి ఆ విధానాన్ని కనిపెట్టడానికి కొన్ని శతాబ్దాలు పట్టింది. అట్లానే ఇదీను.

అంటే మూలశక్తిలో సకల మూలకాల ధర్మాలు, తద్వారా ఆ మూలకాల సముదాయాలైన వివిధ పదార్థాల ధర్మాలు ఆ శక్తి యొక్క పరిణామంవల్ల బహిర్గతమవుతాయి. అట్లానే ఈ మూలకాలు కొన్ని పద్ధతులలో సముదాయంగా ఏర్పడ్డపుడు జీవము లేక చైతన్యము అన్న శక్తియొక్క ధర్మము వ్యక్తమై ఆ పదార్థము సజీవమని మనచేత వ్యవహరింపబడుతుంది. దీనికి మరో తార్కాణం. చాలా ముడి పదార్థాలు - జడమైనటువంటివి - మొక్కలచేత పరిగ్రహించబడి సజీవములై ఆ మొక్కలయొక్క ఆకులుగా, పూవులుగా, కాయలుగా, విత్తులుగా ఏర్పడతాయి. మొక్క ఎదుగుతూంటే అందులో అనుక్షణమూ వృద్ధి అయ్యే జీవకణాల సంఖ్యకు

ఆధారం ఈ ముడి పదార్థాలే. అవి మొక్కలో భాగం కాగానే జీవ పదార్థాలుగా మారిపోతాయి

మరో దృష్టాంతం, బియ్యాన్ని అన్నంగా వండినపుడు గాని, కాయలు వేయించినపుడుగాని అవి జడపదార్థంగా మారుతాయి. వాటిని మనం తిన్నపుడు అవి జీర్ణమై వంటబట్టినపుడు సజీవమైన శారీరక పదార్థంగా మారుతాయి. అంటే మొక్కలు పీల్చుకొనే ముడి పదార్థాలు మన దృష్టిలో జడమే అయినా, వాటిలో జీవత్వం పొందగల గుణం సూత్రప్రాయంగా ఇమిడి, నిద్రాణంగా ఉండి, అవకాశం కలుగగానే సజీవంతో కలియగానే, మేలుకొంటుందన్నమాట - అయస్కాంత స్పర్శకు ఇనుములో నిద్రాణంగా ఉన్న అయస్కాంత ధర్మం మేలుకొని ఇనుము అయస్కాంతంగా మారినట్లు.

అయితే మన దేహంకాని, వృక్షాదులుగాని కొని ముడి పదార్థాలనే ఆహారపదార్థాలుగానూ, జీవపదార్థాలుగానూ మార్చగలవు. సల్ఫ్యూరిక్ ఆమ్లము నీళ్ళకు బదులు పోస్తే బతికే మొక్కలుగాని, జంతువులుగాని లేవు. అంతమాత్రాన అన్ని పదార్థాలలోను జీవ లక్షణం నిద్రాణంగా ఉండదని తేలదు. మనకు, వృక్షాదులకు వాటిలో (ఉదా: సల్ఫ్యూరిక్ ఆమ్లంలోని) జీవత్వాన్ని మేల్కొలిపే శక్తి మాత్రమే లేదని నిరూపణ అవుతుంది. ఈ విషయాన్ని సందర్భానుసారంగా మరొకచోట వివరిస్తాను.

ఇంతవరకూ మనం ప్రస్తావించుకొన్నదేమంటే ఆదిశక్తి యొక్క సహజధర్మం చైతన్యమని; ఆ శక్తి వివిధ పరిణామాలలో వివిధ మూలకాల పరమాణువులుగా అవడంలో వివిధ ధర్మాలు ఆయాపదార్థాలలో ప్రస్ఫుటమైనట్లే వివిధ పదార్థాలలో చైతన్యం కూడా వివిధ స్థాయిలలో (లేక levels కక్ష్యలు) ప్రస్ఫుటమై కొన్ని మాత్రం జీవపదార్థాలుగా సులభంగా మారేవిగాను, కొన్ని అంత తేలిగ్గా మనవల్ల మార్చబడనివిగాను అవుతాయి. "మనవల్ల" అని ఎందుకంటున్నానంటే మానవుని చరిత్రలో వాటిని మార్చగలవారు ఎప్పుడూ వుంటూనే ఉన్నారు గనుక. వారినే యోగులు, సిద్ధులు, మహాత్ములు అంటున్నాము. పాముకాటువల్లనో, తేలుకాటు వల్లనో శరీరగతమై బాధించే విషంయొక్క విషలక్షణాన్ని సంకల్పమాత్రంలో నశింపజేసి రక్షించగలవాళ్ళ నెందర్నో మనమీనాటికీ చూడవచ్చు. రసాయనిక శాస్త్ర ప్రకారం ఆ విషంయొక్క రసాయనిక నిర్మాణాన్నిబట్టి (chemical composition) దానికా

విషదంతం వస్తుందని చెపుతారు. రసాయనిక మార్పు రసాయనికంగా గాని రాదంటారు. మంత్రగాడు సంకల్ప మాత్రంచేత. ఆ మార్పు తెస్తున్నాడుగదా! అట్లానే సల్ఫ్యూరిక్ ఆమ్లాన్ని త్రాగి సురక్షితంగా జీవించేవారు. వివిధ దేశాలలో పర్యటించి శాస్త్రజ్ఞులచేత పరీక్షింపబడి కొనియాడబడిన వారు చరిత్రలో ఎందరో!

ఆధునిక భౌతికశాస్త్రం సృష్టి రహస్యాన్ని అన్వేషించటంలో శక్తి, శక్తిప్రసార విశేషాలదాకా వచ్చి నిలిచిపోయింది. యోగులు, ఋషులు కూడ ఈ శక్తిని గురించి, దానినుండి ఏర్పడిన అణువుల గురించి (కణాదులవారు) చెప్పే ఉన్నారు. కాని వారింకా దూరం పరిశోధన చేయాలంటే మానవుని మనసులో ఇంతవరకూ నిద్రాణంగా వున్న శక్తులు మేల్కొంటేగాని వాటి సహాయంతో ఇంకా అవతలి మెట్టును సులభంగా అందుకోలేరు. యోగసాధనద్వారా, నియమం, నిష్ఠ, తపస్సు, ధ్యానాదులద్వారా మానసిక శక్తులను పెంచుకొని, తరువాత వారు గ్రహించినదేమంటే శక్తికి చైతన్యమనే ముఖ్యలక్షణమున్నదని, చైతన్యంతో కూడుకొన్న ఆశక్తిని ప్రాణశక్తి లేక ప్రకృతి అనీ అన్నారు. చైతన్య లక్షణం ఉన్న ప్రతిదాన్నీ వ్యక్తీకరించి (Personification) వ్యవహరించటం మానవుని లక్షణం. కారణం మానవుడే వ్యక్తీకరించబడ్డ చైతన్యశక్తి గనుక! అందుకే ఆదిశక్తిని "దేవుడు", "దేవి", "జగన్మాత" మొదలైన పదాలతో వ్యవహరించడం జరుగుతుంది.

అంటే ఎక్కడ పదార్థం ఉన్నా అందులో మూలశక్తి, ఆ శక్తి యొక్క చైతన్య ధర్మము ఉంటాయన్నమాట. యోగులు, ఋషులు, వారినుంచి వేరుగావున్న పదార్థాలను ఆధునిక శాస్త్రజ్ఞులు పరిశీలించినట్లు పరిశీలించక, తమ దేహ రూపంలో వారికి అతి సన్నిహితంలో, వారిలో భాగమైయున్న పదార్థాలనే తపస్సులో తరచి చూచి ఆ పదార్థం రూపంలో ఉన్న ఈ సృష్టికంతకు ఆధారమైన ఆ మూలశక్తిని దర్శించి దానియొక్క సహజ చైతన్యస్థితిని అనుభవిస్తారు. ఆధునిక మనస్తత్వ శాస్త్రజ్ఞులలాగ తమ శరీరాలకే పరిమితమైన చైతన్యాన్ని పరిశీలించడంతో తృప్తిపడరు. అందుకే యోగశాస్త్ర గ్రంధాలలో ప్రాణశక్తి ఏ రూపంలో ఏ కేంద్రంలోఉంటుందో చెప్పి, దానిని ధ్యానిస్తే తనలోని చైతన్యస్థితి ఏ ఉన్నత కక్ష్యలనుపొందుతుందో చెప్పారు. అలా సాధన చేస్తే చివరకు "సృష్టి" - "స్థితి" - "లయము" - తిరిగి "సృష్టి" అను ఆద్యంత రహితమైన పరిణామాలను పొందుతూ, వాటిని పొందటానికి హేతువుకూడా తానే అవటం ద్వారా ఆ స్థితులలకు అతీతము, ఆధారమైన ఏకైక చైతన్యశక్తి తానే అని

స్వానుభవము వల్ల తెలిసేస్థితి వరకూ మానవుడు పొందవచ్చని చెప్పబడివుంది. ఆ స్థితి జీవన్ముక్తి, ఆత్మసిద్ధి, జ్ఞానము, సహజ సమాధి, బ్రహ్మ సాక్షాత్కారము మొ॥న పదాలచేత ప్రాచీన గ్రంధాలలో వ్యవహరించబడింది. అంతకుపైన వేరొకస్థితి ఏమీలేదు. అంటే తనలోని చైతన్య శక్తే సృష్టి, సృష్టికి అతీతమైన చైతన్యశక్తి అని తెలిసికోవటం ద్వారా సృష్టిలోని ప్రతి అణువు తనచేత నింపబడి ఉన్నట్లు అనుభవిస్తారు. ఏ ఏ ప్రదేశాలలో ఏఏ ప్రాణికోటికి బాహ్యాంతరాలలో (అంటే మనస్సుకు, దేహానికి) ఏఏ సమయాలలో ఏ అనుభవాలు కలుగుతున్నాయో వాటన్నింటిని ఒకే సమయంలో వాటిలో ఉండే చైతన్యరూపంలో తానే అనుభవిస్తాడు యోగి. శ్రీ శిరిడీ సాయినాధుడు ఈ కక్ష్యకు చెందిన యోగియని చెప్పవచ్చు. వారి ఆజ్ఞను సృష్టిలోని జీవాలేకాక "జడ" పదార్థాలుకూడా అనుసరించేవి. వారి ఆజ్ఞవల్ల కుంభవృష్టి నిలిచిపోయింది. మట్టిలోనుంచి నీరు, ఆ మట్టిలోనుంచే నిప్పు తీసి చిలిమ్ వెలిగించారు. ఎక్కడవున్నా ఏ వ్యక్తి మనస్సులో ఏ క్షణంలో ఏ భావం మెదిలిందో వివరంగా చెప్పేవారు. తామున్న చోటునుంచి కదలకుండానే! అటువంటి స్థితిని పొందితే తనకంటే సృష్టిలో ఎవ్వరూ ఏదీ కూడా భిన్నంకాదని అనుభవ పూర్వకంగా తెలుస్తుంది.

అట్లాకాక సృష్టిలోని వస్తువులన్నీ చైతన్యశక్తి యొక్క రూపాంతరాలని తెలియని ఆధునిక, భౌతిక శాస్త్రవేత్తలు పదార్థం యావత్తూ జడమని, జీవకోటిలోని జీవకణాలన్నీ రసాయనిక పరిణామాల ఫలితమనీ వ్యవహరిస్తారు. సూత్రప్రాయంగా ఆ రసాయనిక పదార్థాలలో చైతన్యం నిద్రాణంగానైనా ఉండకపోతే అది జీవపదార్థంలో బహిర్గతం కావడం సాధ్యం కాదని వాళ్ళు ఆలోచించరు. ఇనుము, బంగారము, రాగి మొదలైన గనులలో ఈ మూలకాలు ఇతర రసాయనిక మిశ్రమాల రూపంలో ఉండడాన పామరులకు ఆ గనులలో దాగి ఉన్న లోహం అర్థంగాదు. వాటి ఉనికిని శాస్త్రజ్ఞులు కూడ indirect గా పరీక్షలద్వారా, ఇతర సూచనల ద్వారా (indications) గ్రహించి (inference) తరువాత పరిశోధనతో, శాస్త్రప్రయోగాలతో ఆ లోహాలను వెలికితీస్తారు.

అలానే మొక్కలలోని ప్రాణశక్తి కూడా నిద్రాణంగా ప్రాణశక్తిని కల్గియుండి జడములుగా తోచే ముడి పదార్థాలను నేలనుండి పీల్చుకొని కొన్ని ప్రయోగాలద్వారా వాటిలోని జీవశక్తిని మేల్కొలిపి తమలోని సజీవధాతువులుగా మార్చుకుంటాయి.

దీనిని పామర భాషలో చెప్పడం వల్ల శాస్త్రజ్ఞులకు తృప్తిగా వుండకపోవచ్చు. ఏనాడో వారిలో ఒకరు దీన్ని గురించి పరిశీలించి శాస్త్రోక్తంగా పరిశోధించి ఈ సత్యాన్నే శాస్త్రీయమైన భాషలో చెబితే తప్ప వారికి నచ్చదు. ప్రస్తుతానికి యీ యోచన లేక ప్రతిపాదన హేతుబద్ధంగా (reasonable and rational) ఉంటే చాలు. మనకు తెలిసినంతవరకు మానవునికి సత్యాన్వేషణను కొనసాగించడంలో హేతువాదమంత నమ్మకమైన సాధనం మరొకటి లేదు. ఉంటే అనుభవమే. దీన్ని మరొకచోట చర్చిద్దాం.

జడం అనబడే పదార్థంలో చైతన్యం ఉన్నట్లు నిరూపించగల ఒకటి రెండు విషయాలు: శ్రీ ఆనందమయిమాత ప్రఖ్యాత దైవస్వరూపిణి. ఆమెకు ఉత్తరహిందూస్థానంలో ఎక్కువ ప్రతీతి. ఆమె బెంగాలులో జన్మించారు. ఆమె బాల్యంనుండి ఏమి చదవకనే, ఎవరూ ఏదీ ఉపదేశించకనే తనకై తానే ఎన్నో దివ్యానుభవాలను పొందడమేగాక చాలామందికి ప్రసాదించారు కూడా. ఆమె భక్తుల్లో ప్రథముడు - 'భాయిజీ' అన్న కలం నామంతో వ్రాసిన "Mother as Revealed to Me" అన్న ఆంగ్ల గ్రంథంలో అనేక అనుభవాలను పొందుపరచారు. ఒకసారి కాళీమాత పూజార్థం ఒక పెద్ద మట్టి విగ్రహాన్ని చేయించి యథారీతిన పూజ చేశారు. తొమ్మిదో రోజున ఆ విగ్రహాన్ని నీటిలో కలపడం ఆచారం. కాని భక్తురాలికి ఆ విగ్రహం నీటిలో కలపడం ఇష్టంలేదని చెప్పగా ఆనందమయి దానిని అట్లానే ఉంచి పూజలు చేయించే ఏర్పాటు చేశారు. ఒకరోజు అమ్మ తన భర్తతోను, భాయిజీతోను మాటలాడుతుండగా అకస్మాత్తుగా ఆమె తన ఎడమ చేతిని పైకెత్తి చూపుతూ; తన మణికట్టు విరిగి పోయిందన్నారు. అట్లా అనేకసార్లు అన్నారు. చూచేసరికి ఆ చేయి మామూలుగానే" ఉండటాన ఏమీ అర్థం కాలేదు. వారు దానిభావమడిగితే నవ్వి ఊరుకొని "మీకే తెలుస్తుంది లెమ్మ"న్నారు. తరువాత తెలిసింది. అదేరోజు ఆ ఆలయంలో దొంగలుపడి నగలు దొంగిలించడంలో ఆ మట్టి విగ్రహం ఎడమ మణికట్టును విరిచారని. ఈ సంఘటనలో అసంపూర్తిగా ఉన్న విషయం సంపూర్ణం కావాలంటే, చెప్పక విడిచిన మరో విషయం చెప్పాలి. ఆ విగ్రహానికి ఆనందమయి పూజచేసిన సమయంలో ఆమెకు అతీంద్రియావస్థ లేక భావ సమాధి ఎంత సంపూర్ణంగా కలిగిందంటే, పూజలో తనకూ ఆ విగ్రహానికీ భేదం మరచి విగ్రహంమీద వేయవలసిన ఆ పూవులను తన తలమీద వేసుకొన్నారట. ఆ సమయంలో ఆమె ముఖంలో ఒక దివ్యమైన వర్చస్సు

అందరికీ సుస్పష్టమైందట. అట్లా పూజలో ఆనందమయిలో వున్న చైతన్యం ఆమె ధ్యాననిష్ఠచేత ఆ విగ్రహంలో నిద్రాణంగా ఉన్న చైతన్యంతో తాదాత్మ్యము, సంపర్కముచెంది తిరిగి ఆమె మనసు మానవస్థాయికి దిగినాకూడా ఆ విగ్రహంలోని చైతన్యంతో తాదాత్మ్యాన్ని కోల్పోలేదు. ఈ అద్భుత సంఘటనలను విగ్రహారాధనవల్ల ఆమెలో కలిగిన మనో దౌర్బల్యంగాను భక్తుల్లోని మూఢత్వంవల్ల వారు ఆదౌర్భల్యంతో లేనిపోని దైవత్వాన్ని ఊహించారని అనుకొనే వారికోసం మరో సంఘటన.

శ్రీ హజరత్ తాజుద్దీన్ ఔలియా నాగపూరులో 1925 వరకు నివసించిన సిద్ధపురుషుడు. ఆయన లీలలూ శక్తులూ అత్యద్భుతాలు. విగ్రహారాధనను విశ్వసించని ఇస్లాం మతంలో జన్మించిన ఆ మహనీయుడు నిర్యాణం చెందిన సమయంలో అక్కడి శ్రీకృష్ణుని ఆలయంలో రుక్మిణిదేవి విగ్రహం 12 సం॥లు సంతతధారగ కన్నీరు కార్చిన ఉదంతం "Times of India" అను దిన పత్రికలో ప్రచురింపబడ్డది.

ఇంకొక్క ఉదాహరణతో ఈ చర్చను ముగిద్దాం. సం॥1858 నుండి 1918 వరకు మహారాష్ట్ర దేశంలోని శిరిడీ అనే కుగ్రామంలో తన అత్యద్భుత శక్తులతో అసంఖ్యాకమైనజనాన్ని అధ్యాత్మికపథంలో నడిపిన మహనీయుడు శ్రీ సాయిబాబా. ఆయన చరిత్రలో ఒకఅద్భుతమైన సంఘటన వున్నది. రామచంద్ర ఆత్మారాం తార్ఖాడ్ బాంద్రాలో నివసించే ఒక ఉత్తమ కుటుంబీకుడు. ప్రార్థన సమాజంలోనివాడు. అతనికి విగ్రహారాధనలో నమ్మకం లేదు: కాని సాయిభక్తులైన తన భార్యాబిడ్డలను ఆటంకపరచలేదు. ఒకసారి అతని భార్య శ్రీ సాయిబాబా దర్శనానికి శిరిడీ వెళ్తూ, కొడుకును తోడు రమ్మన్నది. కాని బాబా పటానికి తాను చేసే నిత్యపూజకు అంతరాయం వస్తుందని అతను రానన్నాడు. అపుడు తండ్రి తార్ఖాడ్, తనకు విశ్వాసం లేకపోయినా కొడుకు తృప్తికోసం తానే ఆపూజ చేస్తానని హామీ ఇచ్చిన మీదట తల్లి కొడుకులు శిరిడీ చేరారు. తన మాట ప్రకారం తార్ఖాడ్ మొదటి రెండురోజులూ యథావిధిగా బాబా పటానికి పూజ చేశాడు. కాని తరువాతరోజు ఆఫీసు తొందరలో నివేదన పెట్టడం మరచి ఆఫీసుకు వెళ్ళిపోయాడు. తార్ఖాడ్ మధ్యాహ్నాం భోజనానికి వచ్చినపుడు ఆ విషయం వంటవాడు జ్ఞాపకం చేయగానే, పశ్చాత్తాపం వ్యక్తంచేస్తూ ఆ పొరపాటును తిరిగి జరుగనివ్వనని హామీఇస్తూ బాబాను తన తరపున క్షమాపణ కోరమని భార్యాబిడ్డలకొక జాబు వ్రాశాడు. అదే సమయంలో శిరిడీలో శ్రీమతి

తార్కాడ్‌తో సాయి అన్నారు. "అమ్మా! ఆకలితో బాంద్రాలో మీయింటి దగ్గర ఏమైనా పెడతారేమోనని వెళ్లాను కాని తలపులు గొళ్ళెంవేసి ఉన్నాయి. అయినా పూజా గృహంలో ఏమైనా ఉంచారేమోనని చూచాను. కాని ఏమీలేదు. ఆకలితో తిరిగి వచ్చాను" సాయి అంతలో బాంద్రా ఎలా వెళ్ళివచ్చారని అర్థంకాక తికమకపడింది శ్రీమతి తార్కాడ్. కాని సంస్కారవంతుడైన కొడుకుకు విషయం వెంటనే అర్థమయింది. తండ్రి పూజలో నివేదన మరచి వుంటారని తెలిసికొని, అటువంటిలోటు జరగకుండా ఇంటికివెళ్ళి తానే స్వయంగా పూజలు చెయ్యటానికి బాబా అనుమతి కోరాడు. "నువ్వు నా ఎదుట ఉన్నావు కదా! ఇక్కడే ఏదైనా పెట్టు. ఇప్పుడు బాంద్రా పోనవసరం లేదు" అన్నారు బాబా. బాబాకు నివేదన ఇచ్చిన తర్వాత తార్కాడ్ కొడుకు తన తండ్రికి జరిగినదంతా ఎరుకపరుస్తూ, పూజలో నిర్లక్ష్యం జరుగనీయవద్దని వ్రాశాడు. ఈ రెండు జాబులూ ఒకే సమయానికి వాటి గమ్యాలు చేరాయి. తార్కాడ్ తనయింట అచేతనమైన చిత్రపటంపట్ల జరిగినలోపం చాలా దూరంలోవున్న శ్రీ సాయికి వెంటనే తెలిసిన విషయానికి ఆశ్చర్యపోయాడు. తార్కాడ్ జాబువల్ల అతని శ్రీమతికి బాబామాటలకర్థం తెలిసింది. ఆ జడమైన చిత్రపటంలో మనకవగతం గాకుండావున్న చైతన్య స్థాయితో బాబాలోని చైతన్యానికి ఏకత్వం ఉండడం వలన మాత్రమే బాంద్రాలో జరిగిన సంగతి శిరిడీలో బాబాకు తెలియడానికి వీలుంది.

ఇటువంటి సంఘటనలు మహాత్ముల చరిత్రలలో ఎన్నో ఉన్నాయి ఇప్పుడు మనమధ్య సంచరిస్తున్న అనేకమంది మహాత్ముల భక్తులకు ఇటువంటి అనుభవాలు ఎన్నో! వాటిని గురించి యోచిస్తే మన ఆధునిక శాస్త్రానికీ, హేతువాదానికీ అవగతంగాని రహస్యాలెన్నో సృష్టిలో ఉన్నాయని తెలుస్తుంది. బుద్ధుని నిర్యాణానికి కొంచెముందుశిష్యులు ఆయనను ప్రశ్నించారు - "మీరు మాకు సృష్టి రహస్యాలన్నీ బోధించి నట్లేనా?" అని. ఆయన దగ్గరగావున్న చెట్టుకొమ్మనుంచి గుప్పెడాకులు కోసి వారికి చూపుతూ - "ఈ గుప్పెట్లోని ఆకులసంఖ్య నేను మీకు చెప్పిన సత్యాలసంఖ్య అనుకొంటే, ఈ వనంలోవున్న అసంఖ్యాకమైన చెట్లకున్న అన్ని ఆకులూకలసి ఎన్ని వుంటాయో అన్ని ఉంటాయి చెప్పనివి. అవి ఎవరికి వారే తెలుసుకోవలసినవి. అవి చెప్పటానికి ఎన్ని జీవితాలైనా చాలవు" అన్నారు.

ఇంకా ఇతర విషయాలను తరిచేముందు యిప్పటిదాకా మనం పరిశీలించిన విషయాలను మననం చేసుకుందాం.

(1) మొదట అంతటా ఒకే శక్తిఉన్నది.

(2) ఆ శక్తికి చైతన్యం ఒక లక్షణం.

(3) అందువలన ఆ శక్తి తన ఇచ్ఛానుసారం తనలోమార్పు తెచ్చుకుంది. అప్పుడు వివిధ తరంగ విశేషాలు, వాటి సముదాయాలైన మూలకాల పరమాణువులు, వాటి కలయికవల్ల వివిధ వస్తుజాలమూ ఏర్పడ్డాయి.

(4) సృష్టి "ఎప్పుడు" "ఎందుకు" జరిగింది? అన్న ప్రశ్నలకు "ఎందుకు" అంటే "చైతన్యముగల మూలశక్తి తనలో మార్పు తెచ్చుకొనే స్వభావం గలది గనుక సృష్టి జరిగింది" అనే చెప్పకోవలసి వస్తుంది.

# ఏది నిజం! 5

## "బ్రహ్మసత్యం - జగన్మిథ్యా"

నేను పనిచేసే కాలేజీలో 1969 వరకు B.Sc. చదివిన ఒక సైన్సు విద్యార్థి చాలా మేధావంతుడని కాలేజీలో పేరుపొంది, తన కొచ్చిన ఫస్టుక్లాసువల్లే ఆ పేరు నిజమని నిరూపించుకున్నవాడు నన్నడిగాడు "భగవంతుడున్నాడంటారు సార్! కాని నాకు నమ్మకంలేదు. మీకు బాగా నమ్మకం అని విన్నాను. భగవంతుడున్నాడంటారా – అంటే యిప్పుడు మనచుట్టూ యీ భౌతిక ప్రపంచం (Materialworld) వుందిగదా? ఉదాహరణకు యీ గోడ వున్నది. అదేవిధంగా, అంత వాస్తవంగాను దైవం, సృష్టికర్త అయినవాడున్నాడంటారా?"

అందుకు నేను "నా అభిప్రాయాన్ని నాకు చేతనైనంత విపులంగా చెబుతాను. అది శ్రద్ధగా విని, చివరికి ప్రశ్నలుంటే వేద్దువుగాని, ముందు ఓపికతో నిశితంగా విను" అని యిలా చెప్పాను.

"భౌతిక సృష్టి వున్నట్లుగా దైవం గూడ వున్నాడా?" అని నువ్వడిగినదాంట్లో మొదటి భాగాన్ని తీసుకొని దానిని ముందు పరిశీలిద్దాం. భౌతిక సృష్టి - యీ గోడ వుదాహరణగా - వుంది అన్నావు. నీకెలా తెలుసు దానివునికి? ఒకటి: దృష్టి - అది

కనబడుతుంది. స్పర్శకు గట్టిగా, దృష్టికి ఎత్తుగా, యిటునుంచి అటు మనం చొరబడడానికి వీలు లేనిదిగా వున్నది. ఇది మన ఇంద్రియానుభవం. ఒకసారి వాస్తవికమైన తత్వాన్ని నిశితంగా విమర్శించి చూద్దాం.

సైన్సు ప్రకారం యీ గోడ – అలానే అన్ని వస్తువులున్నూ – పరమాణువుల సముదాయం. పరమాణువులలో యింకా సూక్ష్మమైనభాగాలు వున్నాయి. ఇవి ఎలక్ట్రానులు, న్యూట్రానులు, ప్రోటానులు ఇవన్నీ ఏ యంత్ర సహాయంతోనూ వాటి నిజస్వరూపాలను మనం చూడ్డానికి వీలులేనంత సూక్ష్మంగా వుంటాయి.

ఈ ఎలక్ట్రానులు; న్యూట్రానులు, ప్రోటానులు - పరమాణువుకంటే ఎంతో చిన్నవి. ఇవి ఒక పరమాణువులో ఆక్రమించే స్థలంకంటే వాటి మధ్య ఉండే ఖాళీయే ఎక్కువగా ఉంటుంది. ఈ గోడలోని పరమాణువులు గూడ వాటి పరిమాణాలతో పోల్చి చూస్తే, ఎంతో దూరం దూరంగా వున్నాయట. దట్టము, ఘనము అయిన పదార్థంలో గూడ పరమాణువుల మధ్య, పరమాణువులలోని సూక్ష్మతర అంశాల (ఎలక్ట్రాను మొదలైనవి) మధ్యా వున్న ఖాళీ ప్రదేశమే ఎక్కువ. అందులోనూ కొన్ని నక్షత్రమండలాలలో వున్న పదార్థం – ఒక్క ఘన అంగుళాల పరిమాణం గలది – భూమిమీద కొన్నివందల టన్నుల బరువైన పదార్థంతో సరిపోయేటంత దట్టంగానూ, సన్నిహితంగాను వుండటం చూస్తే మన భూమిమీద ఘన పదార్థం వాస్తవంగా అంత ఘనమైనది గాదని తెలుస్తుంది.

ఈ గోడలోని పరమాణువుల మధ్య వాటిలోని సూక్ష్మతర అంశాల మధ్యా ఖాళీ ఎంత అంటే - మనకింత వాస్తవమన్పించే యీ "గోడ", అందులోని పరమాణువు దృష్ట్యా చూస్తే అసలు గోడేగాదని, ఘనమేగాదనీ తేలుతుంది. ఒక ఎలక్ట్రానుకుచైతన్యమున్న దనుకుంటే, దానికి ఆగోడ ఒక నక్షత్ర మండలంలా, అందులోని పరమాణువుల మధ్యచోటు ఒక అంతరిక్షంలాగా - అంతా ఖాళీగా తోస్తుందట! అంటే గోడయొక్క అస్తిత్వం 'గోడ (is to) మనము' అన్న పరిమాణ నిష్పత్తిమీద ఆధారపడి మన యింద్రియాలకు గోచరించిన అనుభవమే నన్నమాట. దీనినే యింకా తేలికైన పదాలలో చెప్పాలంటే, మనం గనుక ఎలక్ట్రాను పరిమాణాన్ని పొందగల్గితే, యిప్పటి మన స్థితిలో మన కనుభవమయ్యే "గోడ", "గోడ"గా వుండదు;

అంతా ఖాళీప్రదేశమే అవుతుంది! అక్కడక్కడా నక్షత్రాలలా పరమాణువులు (Atoms), పరమాణు సముదాయాలైన అణువులూ (Molecules) కనబడతాయి. అంతా బహుశః ఆకాశంలో యిప్పుడు మనకగుపించే నక్షత్రకోవలలా (Milky way) అందులోని పరమాణువులు, అణువులూ కన్పించి, దగ్గరగా వున్నవి మన యితర నక్షత్రాల్లా తోస్తాయి.

అలాగే, మనము ఏ నక్షత్ర మండల పరిమాణమో - అంత కూడా అక్కర్లేదు - ఒక మహాపట్టణ పరిమాణాన్నో పొందగలిగితే, మనకు యిప్పుడు "గోడ" అన్పించేది గూడ పరమాణు స్థాయిని పొంది, మన దృష్టికి, అనుభవానికి దాని అస్తిత్వమే లేకుండా పోతుంది!

అంటే యిప్పుడు మన ఎదుట గోడ "వుండటం" అన్న విషయం 'గోడ పరిమాణం: (is to) మన శరీర పరిమాణం అన్న నిష్పత్తిమీద ఆధారపడ్డది. ఆ నిష్పత్తి ఎంత మారితే అంతగా గోడ మనకు వాస్తవం కాకుండా పోతుంది! మనం "గోడవున్నది' ' అన్న వాక్యానికి అర్థం. "మన పరిమాణం: గోడ పరిమాణం ఎలా వుందంటే, అది మనపట్ల 'గోడ'గా వర్తిస్తున్నది" అని. ఈ సంబంధము, లేక నిష్పత్తి (relativity or ratio) మాత్రమే మన అనుభవానికి ఆధారం.

అంతేగాదు తిరిగి గోడ గురించి మరింత నిశితంగా చూస్తే, అది పదార్థంచేత చేయబడివున్నది. అందుకే దానిని "భౌతికము" అంటాము.

ఈ పదార్థము యొక్క నిజస్వరూపాన్ని యిందాకటికంటే మరొక అడుగు ముందుకుపోయి విమర్శించి చూస్తే, యీ ఎలక్ట్రాను మొదలైన సూక్ష్మాంశాలు అసలు పదార్థము (material) భౌతికమూ అయిన కణాలుగావని అవి కేవలం శక్తితరంగాలనీ చెబుతుంది నేటి భౌతికశాస్త్ర పరిశోధన! ఆ తరంగాలే కేవలం రూపరహితమైన శక్తిమయములని తెలుస్తుంది. అంటే వీటితో చేయబడ్డ పరమాణువులు కేవలం తాత్కాలికములైన శక్తి తరంగాల సమూహాలేనన్నమాట! అణువులు ఈ సమూహాల సమూహాలు. మన చుట్టూ సృష్టిలోని వివిధ వస్తువులు, పదార్థాలు, జీవులు మొదలైన రూపాలలోవున్న పదార్థమంతా, మనం తలచినట్లు, మన స్థూలమైన ఇంద్రియానుభవం మనకు కనబరచినట్లు, పదార్థమే గాదు. కేవలం ఏ భౌతికరూపమూ లేని శక్తి తరంగాల మయమన్నమాట! అయితే అవి కేవలం తరంగాల సమూహాలే అయినా, ఆ

తరంగాలలో యిమిడి వ్యక్తమయ్యే శక్తిననుసరించి మాత్రమే అవి పదార్థంగాను, ఘనమైనవిగానూ ప్రవర్తిస్తాయి.

ఇందుకు ఒక దృష్టాంతం: నీరు కుండలోనిదైనా, చెరువులోనిదైనా చాలా పలుచగావుండి, ప్రతి చిన్న వత్తిడికి, సంచలనానికి, చివరకు గాలి సంచలనానికి గూడ - లొంగిపోయేటంత పలుచటి పదార్థం. అయినా, సముద్రంలో తీవ్రవాయువు చేత తరలించబడ్డ ఆ నీటి తరంగమే ఎంతో ఘనమైన పదార్థంతో చేయబడ్డ నౌకనైనా, మహాపర్వతతుల్యంగా ఒక్క దెబ్బతో తునాతునకలు చేయగలదు. అక్కడ ఆ "ఘనత" తరంగంలో వ్యక్తమయ్యే శక్తి యొక్క ఆధిక్యత వలన కలుగుతుంది. అలానే మన చుట్టూవున్న కేవల శక్తి తరంగాలమయమైన వస్తుజాలం గూడ మనపట్ల "పదార్థం" గా ప్రవర్తిస్తుంది. ఇందాక 'గోడ' అంటే ఎలా ఒక కొత్త అర్థం వచ్చిందో అలానే "పదార్థము" అంటే కేవలం మనచేత 'పదార్థము అని చెప్పబడే శక్తి తరంగాల సమూహాలకు, "మనము" అనబడు యీ శక్తి తరంగాల సమూహాలకూ మధ్యన "పదార్థత". (materiality) అన్నది ఒక నిష్పత్తి (ratio); ఒక పరస్పర సంబంధం (relationsip). ఆ తరంగ సముదాయంతో మనకున్న నిష్పత్తి మారిన క్షణంలో అది "పదార్థం" అనడం గూడ అప్పుడే పొసగజాలదు.

అంటే మనకు 'పదార్థము'గా గోచరించేదంతా యదార్థంగా శక్తితరంగ సముదాయమే నన్నమాట. మనచుట్టూవుండే భౌతిక ప్రపంచంలో మనకుగల నిష్పత్తి, లేక సంబంధం చేత మాత్రమే అది 'భౌతికము' అన్నమాట! చివరికి "మనం" గూడ భౌతికంగాదు - శాస్త్రరీత్యా చూస్తే! కేవలం శక్తి తరంగాల గుంపులమే!!

పోనీ, యీ శక్తి తరంగ సముదాయం రూపంలో మనకు గోచరమయ్యే శక్తియొక్క స్వరూప మెట్టిది? "అది తెలియదు" అంటుంది భౌతికశాస్త్రం. ఆశక్తి యొక్క ఉనికిని దానియొక్క ప్రభావం (effect) వలన గమనించవలసిందే. వేడి, వెలుగు, ఘనత, చలనం, పరిమాణం అన్నవి ఆ శక్తి తరంగరూపం ధరించాక, ఆ తరంగ సమూహాలలో కొన్ని మనరూపం గూడ ధరించాక, యీ రెండు తరంగ సమూహాలకూ వుండే సంబంధంయొక్క ప్రభావాలు మాత్రమే మనచుట్టూ వున్న "జగత్తు", "మనమూ" గూడ అట్టివారమే.

ఇందాకటి నీ ప్రశ్నలో - "ఈ భౌతికమైన వస్తువులు ఎలా వున్నాయో, అలా దైవంగూడా వున్నాడా?" అన్నదానిలో, "భౌతిక వస్తువులు ఎలా వున్నాయో............ అలా". అన్న నీ వాక్యాన్ని నిశితంగా Scientific గా పరిశీలిస్తే చూడు, నువ్వుద్దేశించనిది, బహుశః నీవు వుద్దేశించినదానికి విరుద్ధమూ అయిన సత్యం ఎలా వ్యక్తం అయిందో! ఇప్పుడు తిరిగి నీ ప్రశ్న గురించి ఆలోచించు భౌతిక ప్రపంచంయొక్క తత్త్వం గురించి గూడా (ముందు ఒక వ్యాసంలో చర్చించినట్లు) రెండు స్థాయిల నిజమున్నదని తేలింది. ఒకటి, స్థూలమైన అనుభవము, రెండవది దాని యదార్థతత్త్వము. మన జీవితమంతా మొదటిదాని మీదనే ఆధారపడుతుంది. రెండవది వాస్తవం అయినా, అంతమాత్రం చేత రెండవది అబద్ధమంటే శాస్త్రాన్నే కాదన్నట్లవుతుంది.!!

"దేవుడు లేడు" అనే వారంతా - సృష్టిని కేవలం స్థూలము, వ్యవహారికమూ అయిన స్థాయిలో మాత్రమే చూచి, "వాస్తవము" మాత్రమే అయిన భగవంతుని ఉనికిని అర్థం చేసుకోరు. అసలు "భగవంతుడు లేడు" అన్నవారి మాటలకు అర్థం ఏమిటి? శక్తి తరంగ సముదాయములు (='భౌతిక' వస్తువులు) వున్నాయిగాని, శక్తి అనేది లేదు అని! పరమాణువును విచ్ఛిన్నం చేస్తేగాని ఆ తరంగ సమూహంలో శక్తి వున్నట్లనుభవంలోకి రాదు మరి!

ఈ సకల సృష్టిలోనూ బ్రహ్మాండాలనుండి పరమాణువులు, యింకా సూక్ష్మతర అంశాలూ ఏ శక్తియొక్క తరంగ సముదాయాలో, ఆశక్తినే 'దైవశక్తి' అన్నారు పూర్వులు. 'దైవం' అన్నారు ఆస్తికులు. అందుకే ఒక ఉపనిషత్తులో దైవం గురించి అంటాడు- "దేనిని భక్తులు దైవమని, జ్ఞానులు ఆత్మయని, శాక్తేయులు శక్తి యని, ఋషులు సత్యమనీ అంటారో అది ఒక్కటే వస్తువు" అని. వారి స్వభావ భేదం వలన దానిపట్ల వారికి కల్గిన విభిన్న భావాలను వివిధ పదాలలో వ్యక్తం చేశారు". అని "ఏకం సద్విప్రాః బహుధా వదంతి" అన్నారు. ఇప్పటిదాకా చెప్పినదాని పర్యవసానమేమంటే, అసలు వాస్తవంగా వున్నదానిని (శక్తిని) దైవం అని, మనకు "గోచరించే" వ్యవహారిక సత్యాన్ని "జగత్తు" అనీ అంటారని చెప్పడమే. 'సత్', 'సత్యం' అన్నవి దైవానికి పర్యాయ పదాలుగా ప్రాచీన గ్రంథాలలో చెప్పబడినాయి. ఆ దైవమే "నిజం?".

# ఏది నిజం? ౬

ఆదిలో ఒకే చైతన్యం - కేవలం చైతన్యం - ఉన్నది. అది చైతన్యం గనుక, దానికి "ఎఱుక" అన్నది ఒక పేరు; అంటే తన ఉనికిని సదా అనుభవిస్తూ, "నేను ఉన్నాను" అన్న స్ఫురణ కలిగి ఉంటుంది అని అర్థం.

అది చైతన్యం గనుక, ఊహాశక్తి గూడ కలిగి ఉంటుంది. ఊహాశక్తి అంటే, ఒకే చైతన్యం అనేక రూపాలు ధరించగల శక్తి అన్నమాట. మన మనస్సునే గమనించండి: ఏదైనా ఒక సన్నివేశాన్ని ఊహించుకొన్నప్పుడు ఆ సన్నివేశంలోని దేశకాలాలు, వ్యక్తులు, వాళ్ళ క్రియలు అన్నీ ఆ మనస్సే అవుతుంది. ఆ కల్పిత రూపాలను చూచి అనుభవించేశక్తి కూడ కలిగి వుంటుంది. దీనిని 'క్రియాశక్తి', లేక 'కల్పనాశక్తి' అంటారు. ఈ శక్తి ఆది చైతన్యానికి లేకపోతే, దాని అంశమైన మనసుకు గూడ ఉండేదేగాదు. అందుకే భగవంతునికి వేదంలో 'కవి' అనే పేరున్నది.

"కవిః కవిత్వాది విరూపం అస్పృజత్" అంటుంది ఋగ్వేదము. (10-31-3) "కవి (సృష్టికర్త) తన కవితాశక్తితో (ఇంత) సౌందర్యాన్ని అంతరిక్షంలో నిలిపాడు" అని భావం. 'ఇంత సౌందర్యాన్ని' అంటే, 'ఇంత రమ్యమైన సృష్టిని' అని అర్థం. అలానే మరొక ఋషి, "య కవిః కావ్యాపురె రూపం ద్యౌరివ పుష్పతి" అన్నారు (ఋగ్వేదము-8-41-5) అర్థం. "అతడు - ఆ కవి-తన కవితాశక్తి చేత వివిధ రూపాలను స్వర్గమువలె పోషిస్తాడు" అని.

మన మనస్సు ఒక సన్నివేశాన్ని ఊహించినపుడు ఆ మనస్సే అందులోని వస్తువుల రూపాలనన్నిటినీ ఎలా ధరిస్తుందో, అలానే ఆది చైతన్యం ఈ సృష్టిలోని వస్తువులన్నింటి రూపమూ ధరించింది. అందుకే ఉపనిషత్తులు చెబుతాయి - ఆదిలో బ్రహ్మ ఒక్కడే ఉన్నాడని; ఆయన తాను అనేకం అవాలని తలచాడని; అందువలన బహుధా అయ్యాడని. తైత్తిరీయోపనిషత్తు (యజుర్వేదములోనిది) ఇలా చెబుతుంది: "సో2కామయత। బహుశ్యాం ప్రజాయే ఏతి। సతపో2 తప్యత। స తపస్తప్త్వా! ఇదగ్ం సర్వమస్పృజత। యదిదం కించ। తత్సృష్ట్వా తదేవాను ప్రవిశత్। తదను ప్రవిశ్య సచ్చత్యచ్చ భవత్! నిరుక్తంచానిర్తుం....... యదిదం కించ। సత్సత్య మిత్యా చక్షతే"!

అర్థం - "అతడు ఇట్లు కోరెను: 'నేను అనేకమగుగాక! నన్ను నేనే ఉద్భవింపజేసికొందును గాక!" అతడు (అట్లు) తపస్సు చేసెను; తపస్సుచేసి దీని (సృష్టి) సంతతినీ సృష్టించెను. దానిని సృష్టించుటతో అందు ప్రవేశించెను. ప్రవేశించి 'సత్' ('సత్యము', లేక 'ఉన్నది') మరియు నిర్వచించనలవికానిదియు............ మొదలుగా గలవన్నియూ అయినది సత్యము (అది చైతన్యము)".

మనం జైలులో పడ్డట్టు కలగన్నామనుకోండి. మన భౌతిక దేహం నిజంగా పట్టుపరుపు మీద పడుకున్నా, కలలోని మనకు మాత్రం జైలులోని కటికనేల, అందులోని బాధ మాత్రమే అనుభవమవుతూ, అప్పటికదే వాస్తవంగా తోస్తుంది చూడండి! తిరిగి మెలుకువ వస్తేగాని, ఆ స్వప్న జగత్తు నిజానికి లేనేలేదని తెల్లవారితేగాని తెలియదు. మన భౌతిక దేహము దాని అనుభవమయిన ఈ భౌతిక ప్రపంచమూ ఒకేసారి గోచరిస్తాయి. అంటే మనం భౌతిక దేహాన్ని అనుభవించే మానసిక స్థితిలో వుంటేనే భౌతిక ప్రపంచం మనకు అనుభవమూ, వాస్తవమూ అవుతుంది. మన మనస్సు స్వప్న దేహాన్ని ధరిస్తే స్వప్న జగత్తు మాత్రమే అనుభవమవుతుంది. మన స్వప్న దేహానికి స్వప్న జగత్తే భౌతికమూ వాస్తవమూ అవుతుంది. అలాగే ఈ జగత్తు దేవుని ఊహ, దేవుని ఊహలలోని దేహాలమే మనము. అటువంటి మనకు దేవుని ఊహారూపమైన ఈ ప్రపంచం వాస్తవమూ, భౌతికమూ అవుతుంది. మన అనుభవం స్వప్నానికి, నిద్రకూ, జాగృతకూ భిన్నమైన మరేస్థితినైనా పొందగల్గితే, దానిననుసరించి అటువంటి దేహాన్ని - ప్రపంచాన్ని అనుభవిస్తాము. ఎప్పుడైనా మన స్థితి, మన ప్రపంచం యొక్క స్థితీ ఆ సమయంలోని మన చైతన్యస్థితిమీద ఆధారపడి వుంటుంది. **వీటినే లోకాలు అంటారు.**

అయితే మన మనస్సు ఊహలరూపం ధరించినట్లే, భగవంతుని చైతన్యం గూడ సృష్టియనే ఊహలరూపం ధరించింది గదా! ఈ జగత్తే భగవంతుడా?" అన్నది ప్రశ్న; "అదిగాక దైవం లేదా?" అన్నది ప్రశ్న.

మన ఊహలోగాని, స్వప్నంలోగాని ఒక విశేషమున్నది. మన చైతన్యంలో కొంతభాగమే ఆ వూహలరూపం ధరించేది. ఒక భాగం మాత్రం ఊహలరూపం ధరించక, ఆ ఊహలను ఊహిస్తూ, సినిమా చూచినట్లు వాటిని చూస్తూ, తాను మాత్రం ఆ చూడడమనే క్రియతప్ప మరేమీ చేయక అలానే ఉండిపోతుంది. అందుకే

దానిని 'సాక్షి' అంటారు; దాని లక్షణం 'చూచుట', లేక గమనించుట; దానికి రూపం లేదు; అందుచేత దానిని 'జ్ఞాననేత్ర' మని, 'విరూపాక్ష' మనీ అంటారు. అలానే భగవంతుడనే మహాచైతన్యంలో కొంతభాగమే సృష్టిరూపం ధరించి, మరికొంతభాగం సాక్షిభూతంగా వుండి, దానినంతటినీ చూచి అనుభవిస్తూంటుంది. స్వప్నంలోగాని, ఊహలలోగాని ఏదైన తన్నులాటను ఊహిస్తే, ఆ సన్నివేశంలోని దేశ - కాల - వ్యక్తుల బాహ్య రూపాలు మాత్రమేగాక, వారి హృదయాలు, మనస్సులూ, వారి ఉద్రేకాలు, వారిలో ఒకరినొకరు చూచుకొనే శక్తీ రూపాలు మన మనస్సే ధరిస్తుంది. (దీనిని బట్టే రచయితలు కావ్య రచన చేసేది గూడ) అలానే భగవంతుని ఊహగా జనించిన ప్రపంచంలోని ఊహారూపాలమైన మనహృదయాలలోని ఆవేశాలను 'సాక్షిమాత్రం'గా గమనిస్తూండే మనలోని సాక్షిరూపంలో - అంటే మనద్వారా కూడ - దైవమే చూస్తూ, సృష్టిని అనుభవిస్తాడు. అంటే వాటిని ఆది చైతన్యమే అనుభవిస్తుంది. అందుకనే భగవంతుణ్ణి "సాక్షి" అని, "సకలభూత హృదయాంతస్థితుడు" అని, "విరూపాక్షుడు" అనీ అంటారు. అందుకే వేదము, ఉపనిషత్తులు, భగవద్గీతలలో - దైవంలోని ఒక భాగమే విశ్వమైందని, "పాదోస్య విశ్వాభూతాని" అని చెప్పారు. అంటే, "అతనిలో ఒకభాగం మాత్రమే విశ్వము, భూతములూ అయినది" అని అర్థం.

ఊహలోని దేశ కాలాదులు, ఆకాశమూ గూడ మన మనస్సే అయినట్లు, సృష్టిలోని దేశ కాలాలు, పంచభూతాలూ ఆది చైతన్యమే అయింది. "మాయా కల్పిత దేశకాల కల్పనా వైచిత్రచిత్రీ కృతం" అని దీనినే అన్నారు ఆదిశంకరులు.

స్వప్నంలో మనం చూచే వ్యక్తుల రూపాలలోను - వారిలోపల బయట - అంతటా మన చైతన్యమే ఎలా వుంటుందో, అలానే సృష్టి కర్తయొక్క కల్పనలమైన మనకు గూడ లోపల, బయట, అంతటా దైవమను ఆది చైతన్యమే వుంటుంది. దానినే వేదంలో "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" అంటే "లోపల, బయట, సర్వత్రా వ్యాపించి నారాయణుడే ఉన్నాడు'' అన్నారు. ఆ వ్యాపించి యున్నదానినే 'విష్ణువు' అన్నారు.

ఆదిలోని కేవల చైతన్యం - తన భావనచేత అన్ని రూపాలూ ధరించి పొందిన ఆనందాన్నే, మానవులు గూడ తాత్కాలికంగా కొంత వరకూ సాహిత్యసృష్టిలోను, నృత్యము మొ॥న కళలలోనూ పొందుతారు. కనుకనే "రసోవైసః" ''రసానుభవ

స్వరూపమే భగవంతుడు" అన్న ఉపనిషద్వాక్యాన్ని సాహిత్యకారులు తమ సిద్ధాంతానికి మూల ప్రాతిపదికగా తీసుకొన్నారు. అలాటి కళలను చూచి ఆనందించేవారి మనస్సు గూడ అంతసేపూ, వాటిని సృష్టించేప్పుడు ఆకళాకారుడెలాటి ఆనందం పొందుతాడో, అదే ఆనందాన్ని పొందుతుంది. అదే కళ యొక్క సాంఘిక ప్రయోజనం. దివ్యమైన యీ సృష్టిక్రమాన్ని, అందులోని ఆనందాన్నీ మనిషి వాటిలో మచ్చుకు చూస్తాడు గనుకనే మన ఋషులు కళలన్నింటికీ ఒక దివ్యత్వము, ఆధ్యాత్మిక ప్రయోజనము దివ్యమైన ఉత్పత్తి కల్గియున్నాయని వ్రాశారు - నృత్యానికి శివుడు, గానానికి సరస్వతి అన్నట్లు. ఆ సులువెఱిగి అట్టి ప్రయోజనంకోసం ఆకళల నభ్యసిస్తే అవి దివ్యానుభూతికే దారితీస్తాయి. లేకుంటే పతనానికి, అవినీతికి, తద్వారా జాతియొక్క పతనానికి దారితీస్తాయి. ఒకే మానసికశక్తి, ఒకడు మహామేధావియో, కళాకారుడో, శాస్త్రవేత్తో కావడానికి ఉపకరిస్తే, మరొకడు దొంగో, హంతకుడో, పిచ్చివాడో అవడానికి కారణమైనట్లు!

ఈ సృష్టిలో పంచభూతాలు, వివిధ వస్తువుల రూపాలన్నీ ఒకే ఆదిశక్తి ధరించింది గనుక, మనం ఏ వస్తువును ధ్యానించినా, సరియైన రీతిన ధ్యానిస్తే, ఆ రూపానికి మనకూ ఆధారమైన చైతన్యం - అంటే దివ్యత్వం - మనకు అనుభవమవుతుంది. యోగశాస్త్రంలో పంచ భూతాలలో దేనినైనా తదేకంగా ధ్యానించగల్గితే, క్రమంగా యోగ పూర్ణత లభిస్తుందన్నారు. అంతేగాదు ఏ వస్తువును, ఏ భావాన్నీ ధ్యానించినా అటువంటి దివ్యానుభూతే కల్గుతుందన్నారు. మన ఋషులు ఒక ఇంద్రియాన్నో, అవయవాన్నో గూడ తదేకంగా ధ్యానించినా వచ్చే చరమ అనుభవం మాత్రం ఒక్కటేనన్నారు. పంచదారతో చేసినది చిలకైనా, మనిషైనా, తుపాకైనా పంచదార లక్షణాలు కల్గియుండి, తీపియనే అనుభవాన్నే యిచ్చినట్లు, మన ప్రాచీనులు విగ్రహారాధన చేయమని చెప్పడంలోగల రహస్యమిదే. సృష్టిలోని ఏ విషయాన్నైనా చివరంటా అన్వేషిస్తే చివరకు తేలేది, వాటన్నింటికీ ఆధారమైన ఆచైతన్యమే. ఈ రహస్యాన్ని గుర్తించారు గనుకనే మన ప్రాచీనులకు ఏ మతాన్నైనా ద్వేషించడం హీనమని, అనవసరమనీ తోచి, మహోన్నతమైన సహనం, అన్ని మతాలపట్ల గౌరవమూ సాధ్యమైనాయి. అలాగాని వారికి వారి దైవంమీద భక్తికంటే ఇతర మతాల మీద ద్వేషము, అసహనము, విమర్శ ఎక్కువై అసలు దారి తప్పారు. ఈ అధోగతిని తప్పుకున్న ఆ మతాలలోని కొద్దిమంది సర్వమత సామరస్యాన్ని అర్థం చేసికొని అన్నింటినీ గౌరవించటం ద్వారా యీ అసహనమూర్ఖుల విమర్శలకు గురియవు

తున్నారు. సరియైన బాట చెప్పినవారంతా ఆ సమాజాలలో అలాంటి బాధలనే ఎదుర్కొన్నారు. అటువంటి అసహనమూర్తుల విమర్శలే ఈ సామరస్యమునే బాటమీద నడిచే పవిత్రమూర్తులకు తమబాట సరియైనదని సంతోషంతో గుర్తించి, ధైర్యంగా ఆ బాటనే పయనిస్తూ, దానినే బోధించుకుంటూ ముందుకు పోవాలని తెల్పుతాయి.

"అయితే ఈ ఆది చైతన్యాన్ని అలానే పిలవక, బ్రహ్మ, విష్ణు, శివ అని ఎందుకు పిలవాలండీ?" 'బ్రహ్మ' అంటే "అంతటా నిండియున్నట్టి" అని, 'విష్ణు' అంటే వ్యాపించినద'ని; 'శివ' అంటే 'పరిశుద్ధ' మని అర్థమని తెలుసుకోవాలి. ఆ దేవుణ్ణే చైతన్యమని, శక్తియనీ గూడ వ్యవహరించారు ఋషులు. ఈ సమగ్ర రూపాన్ని గుర్తుంచుకొని, శివ, విష్ణు సహస్రనామాలను శ్రద్ధగాచదువుకొంటే ఇంకా ఎన్నెన్నో విషయాలు తెలుస్తాయి. వాటన్నింటినీ వ్రాయడానికి ఒక జీవితకాలం చాలదు.

సర్వమత సామరస్యాన్ని ఎరిగిన మన మహర్షులు - ఏ రూపంలో వారికి సత్యాన్ని గురించిన బోధ లభించినా, దానిని పరమ సత్యంగానే గౌరవించి ఆహ్వానించ గల్గడం గొప్ప సంగతి. అందుకేవాళ్ళు అనగలిగారు "ఏకం సత్, విప్రా బహుదావదన్తి" అని అంటే సత్యం ఒక్కటే; దానిని తెలిసికొన్న వారనేకులు అనేక విధాలదానిని వ్యక్తం చేయవచ్చు అని. కనుకనే వాళ్ళు అనగలిగారు, '**ఆనో భద్రాః క్రతవో యాంతు విశ్వతః (ఋగ్వేదం 1-89-1) । 'ఉత్తమభావాలు మాకు సర్వదిశలనుండీ వచ్చు గాక" అని. అందుకే వారు ప్రార్థించగలిగారు "సర్వేజనాసుఖినోభవంతు."- "సర్వ జనులూ సుఖవంతులగుదురుగాక**" అని. వారి ప్రార్థన మనకు-మత-ప్రాంతాలకు పరిమితం గాలేదు. ఇందులో ద్వేషానికి, సంకుచితత్వానికి తావులేదు. "నిజం" అన్న దానికి **అదొక్కటే విశేషమైన లక్షణం. సంకుచితత్వము, అజ్ఞానమూ అన్న అంధకారం వైపుగాక, నిజం అన్న వెలుగు వైపుకే మా మనస్సును తీసుకుపోవుగాక! అన్నదే వారి చరమ** ప్రార్థన.

"తమసో మా జ్యోతిర్గమయ!"



# ఈ పుస్తకం గురించి

"This book is small in size but great in its contents. The author has done immense service to Indian culture and philosophy, this book is a need of the hour." B. Kutumba Rao ("Triveni")

"ఇందు కంఠస్థముజేసి మననము చేయదగిన వాక్యముల నేకములున్నవి. ఈ తరగతి గ్రంథములు నేటి మనవునికెంతయు నావశ్యకములు..... అన్ని తరగతుల చదువరులునూ చదివి తీరవలసిన గ్రంథము" - కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య ("నావాణి")

'ఇలా ఆత్మతత్వాన్ని వైజ్ఞానికంగా నిరూపించే యత్నంలో 40 ఏళ్ళుగా ఉన్నాను. కాని యింత సమగ్రంగా, సహేతుకంగా నిరూపించలేదు.... జ్ఞానార్జనలో ఆసక్తిగల వారికి వెలుగుబాటచూపి, సంశయ విచ్ఛేదం చేయగల పుస్తకం" - శ్రీ వసంతరావు వెంకటరావు. (రిసెర్చ్ ఆఫీసరు, తెలుగు ఎకాడమీ)

"నవీన కాలపు విద్యార్థులను, విద్వాంసులనూ ఆకర్షించేటట్లు నవీన సిద్ధాంతాలతో మనస్సుకు హత్తుకునేటట్లు. మనం మాట్లాడుకున్న రీతిన రచన సాగింది........" ఆయాస్య" ("ఆంధ్రప్రభ" వారపత్రిక).

"ఈ సృష్టి ఎందుకు రూపొందింది?....... ఎలా ఏర్పడింది. మొ॥న అంశాలు భౌతికశాస్త్రరీత్యా అందరికీ అర్థమయ్యేలా చర్చించబడ్డాయి. పారమార్థిక విషయాలు భౌతిక శాస్త్రరీత్యా ఋజువుకాగలవని, తర్కానికీ, హేతువాదానికి నిలబడగలవనీ......... శాస్త్రవేత్తల అభిప్రాయాలు గూడ ఉటంకించబడ్డాయి.......... రచయిత ఇటువంటి మరికొన్ని పుస్తకాలు ప్రచురిస్తారని ఆశిద్దాం!" - "ప్రసూన" ("ఆంధ్రప్రభ". ఆదివారం)

"ఈ పుస్తకం చాలాబాగుంది........ దిక్కుతోచక 'డ్రిఫ్ట్' అయిపోతున్న నవతరానికి అవశ్యం పఠనీయం మీ పుస్తకం".

ఎ.వి. రమణ (రసాయనిక శాస్త్రోపాధ్యాయులు, నూజివీడు)

